శృంగారకరుణాద్భుత రౌద్రరస ప్రాధాన్యంబైన

# మిత్రవిందాపరిణయనాటకము.

---

ఇది

గుంటూరు జిల్లా పల్నాడుతాలూకా మాచర్లగ్రామనివాసుండును

సంగీత సాహిత్యవిద్యా విశారదుండునగు

బ్రహ్మశ్రీ సూరపరాజు వేంకటరమణకవిచే

రచియింపబడి

ఆకెళ్ళ సూర్యనారాయణశాస్త్రిచే

పరిశోధింపబడి,

నల్లగొండజిల్లా భువనగిరితాలూకాలోచేరిన చొల్లేరుపుర దేశపాండ్యాముక్తేదారు

భారద్వాజసగోత్రోద్భవులైన వ పటువారి యధికారములను పొందిన

మహారాజరాజశ్రీ

తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారికి

౧ కృతియియ్యఁబడి

ఏలూరు

మంజువాణీముద్రాక్షరశాలయందు

# ఈనాటకములో వచ్చెడు స్త్రీపురుషపాత్రలు.

## స్త్రీపాత్రలు.

1 నటి.
2 వేశ్యాస్త్రీ-శృంగారవతి.
3 మిత్రవింద-కథానాయిక.
4 కీరవాణి-మిత్రవింద చెలికత్తె.
5 మదనమాల-డిటో.



## పురుషపాత్రలు.

1 నటుడు.
2 విందరాజు (మిత్రవింద) పెద్దన్న.
3 విందరాజు-భటుడు.
4 విందరాజు-మంత్రి (వర్మసచివుడు)
5 దుర్యోధనభటుడు (చండప్రతాపుడు)
6 ఆకాశవాణి (విష్కంభము)
7 అనువిందుడు (విందరాజుతమ్ముడు)
8 నారదుడు (దేవలోకముని)
9 కృష్ణమూర్తి.
10 బలరాముడు (కృష్ణమూర్తి అన్న)
11 సాత్యకి (కృష్ణమూర్తితమ్ముడు)
12 కృతవర్మ (కృష్ణమూర్తి స్నేహితుడు)
13 దుర్యోధనుడు (రాజరాజు)
14 దుశ్శాసనుడు (దుర్యోధనుని తమ్ముడు)
15 లక్ష్మణుడు (దుశ్శాసనునికొడుకు)
16 కర్ణుడు (దుర్యోధనుని ప్రాణమిత్రుడు)
17 మాళవరాజు
18 కోసలరాజు
19 కాశిరాజు
20 సాల్వరాజు
} వీరు దుర్యోధనపక్షమువారు.
21 కేకయరాజు
22 సృంజయరాజు
23 కర్ణాటరాజు
24 మత్స్యరాజు
} వీరు కృష్ణుని పక్షమువారు.
25 వ్యాసమహర్షి.

# మిత్రవిందాపరిణయ నాటకము.

## కథాసంగ్రహము.

## ప్రథమాంకము.

రం. (1) నటీసూత్రధారులసంభాషణము. శరదృతువర్ణనము.
(2) అవంతిదేశాధీశ్వరుండగు విందరాజుకోటలో. రాజునకుమంత్రికిసంభాషణ- వారాంగనాప్రవేశము శృంగారరసప్రధానము. దుర్యోధనచక్రవర్తి భటుండు విందరాజుసభకువచ్చుట రౌద్రరసప్రధానము.

## ద్వితీయాంకము.

రం (1) విందుడు అనువిందుడు నర్మసచివుడు ఆకాశవాణివాక్యము, హాశ్చర్యరసము. విందానువిందుల సంభాషణము రౌద్రరసము. నారద సమాగమము నారదవిందానువిందుల సంభాషణము, శౌండీరసము.

రం (2) విచిత్రసౌధమునందు దోమతెర మంచమునందు నిద్రించు మిత్రవిందా స్వప్న సంభాషణము, ఇది దైన్యరసప్రధానము మిత్రవిందకు చెలికత్తెలకు సంభాషణము మహాశ్చర్యరసము.

## తృతీయాంకము.

రం (1) సఖీపరివృతయగు మిత్రవిందకడకు నారదుండు ప్రవేశించుట. నారదమిత్రవిందల సంభాషణము. నారదుండు కృష్ణమూర్తి శృంగార మహిమాది వర్ణనలు మిత్రవిందతో చెప్పుట. మిత్రవిందకృష్ణునిపయి మోహాక్రాంతచిత్తయగుట.
(2) మిత్రవింద కృష్ణమోహంబున చెలికత్తెలతో మాట్లాడుట. మిత్రవిందకు మన్మథుండు చతురంగబలయుక్తుండై తనకెదుటనిలచియున్నట్లుతోచుట. మిత్రవిందసఖులంబుగా కందర్పుని భావన దూషణ తిరస్కారంబు లొనర్చుట. మిత్రవింద మదనవేదనచే మూర్ఛిల్లుట. చెలికత్తెలు శైత్యోపచారంబులచే మిత్రవిందను మూర్ఛదేర్చుట. కరుణారసప్రధానము. మిత్రవింద కృష్ణునిగూర్చి విరహపడుట దైన్యరసము. చెలికత్తెలు మిత్రవిందను శృంగారరసమును పోవురమని ప్రేరేపించుట హాశ్చర్యరసము.
(3) మిత్రవింద చెలికత్తెలతో శృంగారవనంబు జొచ్చి వనమునువర్ణించుట శృంగారరసము. చెలికత్తెలు దోహదము సల్పుమని మిత్రవిందను కోరిన ఆజ్ఞయట్లొనరించుట శృంగారరసము.
(4) సూర్యాస్తమయాదివర్ణనము, మిత్రవింద చంద్రోదయవర్ణనచేసి పిమ్మటతదీయకిరణసంతాపంబునకు నోర్వలేక దూషణ తిరస్కారంబులు చేయుట, భయానకరసప్రధానము.

## చతుర్థాంకము.

రం (1) మిత్రవిందాస్వయంవరప్రారంభమునకు విందానువిందులు మంత్రినాలోచించుట. గర్గముని సమాగమము. గర్గముని విందానువిందులతో సంభాషించుట, ఇది హాస్యరసప్రధానము.

(2) మిత్రవింద కృష్ణునిం గూర్చి పరితాపించుట దైన్యరసము. మదనమాల కీరవాణి యను చెలికత్తెలకు మిత్రవిందకు సంవాదము. శృంగారరసము. మిత్రవిందతన పటంబుతో కీరవాణియను చెలికత్తెను కృష్ణమూర్తిదగ్గిరకు పంపుట.

(3) శ్రీకృష్ణునికొలువు. శ్రీకృష్ణునకు మంత్రికి సంవాదము. శ్రీకృష్ణుండు మంత్రితో తనకు దక్షిణవామ భుజనేత్రంబులదురుచుండెనని చెప్పుట. దానికి మంత్రి సదుత్తరంబిచ్చుట, హాస్యరసము.

4 కృష్ణునికడకు కీరవాణియను మిత్రవిందదాసి ప్రవేశించుట. కీరవాణికిని కృష్ణునకును సంభాషణము. కీరవాణి మిత్రవిందపటంబు కృష్ణునకుచూపించి మిత్రవిందసౌందర్యంబు మిక్కిలిచెప్పుట శృంగారరసము. కృష్ణుండుసంతోషించి స్వయంవరమునకువచ్చెదనని కీరవాణితో చెప్పుట, కరుణారస ప్రాధాన్యము.

## పంచమాంకము.

రం (1) శ్రీకృష్ణుని పటంబుతో కీరవాణి మిత్రవిందకడకువచ్చి పటంబుచూపుట. పటంబుజూచి మిత్రవింద కృష్ణుని వర్ణించుట.

(2) అవంతీనగరము. కృష్ణసాత్యకి దుర్యోధన ప్రభృతిరాజులు గొప్ప ఉద్దాలమేడ మిత్రవిందను శృంగరించి చెలులుసభామధ్యంబుననిల్పుట. ఆసమయంబునందు కృష్ణమూర్తి మోహంబునొంది మిత్రవిందనువర్ణించుట శృంగారరసము మిత్రవిందసఖులను చూచి సభాసదులనామంబులు చెప్పుమని చెలులనడుగుట. చెలికత్తెలు దుర్యోధన కృష్ణ ప్రభృతినృపశేఖరుల వేరువేరుచూపించుట. దుశ్శాసనపుత్రుండగు లక్ష్మణకుమారుండు మిత్రవిందనుపట్టబోవుట. మిత్రవిందలక్ష్మణ కుమారుల సంవాదము. మిత్రవిందలక్ష్మణుని ధిక్కరించి మాట్లాడుట రౌద్రదైన్యరసములు. ఆసమయంబున లక్ష్మణానువింద దుశ్శాసన కృపవర్మ కర్ణ సాత్యకి ప్రముఖులకు యుద్ధంబుజరుగుట మహారౌద్రరసము. వ్యాసమహర్షిప్రవేశము. వ్యాసుండు కృష్ణమూర్తిని వర్ణించి మిత్రవిందకు కృష్ణుండేపతియగునని అందరికిచెప్పుట, శాంతరసము. మిత్రవిందకృష్ణునివరించి పుష్పమాలకంఠమునందు వేయుట శృంగారరసము.

(3) మిత్రవిందావివాహము. విందానువిందులు కృష్ణునివేడి యనేక కట్నంబులతో మిత్రవిందాసహితముగ సాగనంపుట.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందా పరిణయ నాటకము.



నాంది.




రాజద్ధరణీతనూజముఖరాజీవంబు స్వాస్యాబ్జుని
న్జేర న్వంకగొనంగ నేత్రరవినిర్యన్జైనుప్పగా జూపి త
న్నారిన్రంజిల జేసి కూరిమెద జెందన్జేయు చోల్లేరు సీ
తారామప్రభుఁడేలుఁగావుత మహోద్యత్కీర్తి
మమ్మెప్పుడున్.

సీతా స్తవము.

చ. నుతగుణవ్రాత హేమమణినూతనరూపసమేత సర్వస
మ్మతమతభూత దుర్భవసమాజపయోనిధిపోత స్వర్గపదా
శ్రితజనమాత నిర్జితవిశిష్టబలిష్ఠకిరాత యిందిరా
ప్రతినిధిజాత సీత సుకృపన్మనుబ్రోవుత నెల్లభంగులన్. 2

(నాద్యంతంబున సూత్రధారుండు రంగస్థలంబుఁజొచ్చి పు
ష్పాంజలియొనర్చి నవ్వుమొగంబుతో)

సూ—సీ. పరమవిద్యాపరంపర బృహస్పతి బోలి,
కాలము మించెదు భూమిఖచరులార!
పృథుతరశౌర్య సంపద నర్జునని గేలి,
వసుధ నేలెడి రాజవర్యులార!
యతులిత భూరి భాగ్యత గుచేలుని మించి,
పొలుపు గాంచెదు వైశ్యపుత్రులార!
భూరిధాన్యవిభరాతి శగారీశ్వరునిసల్పి,
ప్రీతి దేలెడు పాదజాతులార!

గీ. తేవ మీఱంగ నేను పండితుడ కాను
కవిని గాన లసద్గానఘనుడగాను
కాకపోయిన నొక నాటకంబు నాడ
బూనినాడను కరుణించి కాపుమయ్య. 3

(అనియంతకంతకు డెందంబునానందంబు చిందులుత్రొక్క) ఎందుకుసందియంబు? నేనాడదొడఁగొన్న నాటకంబువిఘ్నంబుగాకుండనటుల రక్షించుగలవాఁడా చొల్లేరుసౌధాగ్రసంచారుఁడగు సీతారామచంద్రుఁడే కలండొక్కమాట వేడుకొనియెద(నని)

1. బేహాగ్—ఆదితాళము.

వందనమిహశౌరి హరి హరి మందరధరధారి।
నతజనచందనశంకరవందనహామక బృందావనవిహారి॥ వం॥
నవతులసీమాలా।గోకుల। భవనహేమచేలా।
గాధిజసవనావన సత్యజీవనదుర్భవవారిధికోలా॥ వం॥
సారసదళనేత్రావార్షిక నీరదనిభగాత్ర పాలితా।
నారదశారద నీదరపాండురభూరియశశ్చిత్ర॥ వం॥
సోఁయుద్గుణరంహ తాడేపలి లక్ష్మినృసింహా।
రాయార్చితచొల్లేరుపురీనిలయా యుతరఘుసింహా॥ వం॥

(అని కొంతసేపూరకుండి ప్రతిశిరవంకజూచి శిరఃకంపం బొనర్చి బిగ్గరగా) ఓసి! ప్రేయసీ! నీయొడలసింగారంబు కడచేసికొని వడివడిగా నియ్యెడకురమ్ము, వచ్చుచో తేనెలూరుగానంబుతో వీనయొానునిబాడుకొమ్ము ఎదినీగానసాహిత్య విద్యాకౌశలంబు చెవులారవినియెద.

నటి—(మంతనంబున సంతసింపుచు హాసన్ముఖయై)

2. శుద్ధకాంభోజి—రూపకం.

రాధికాలోలా। సురనాథపాలచేలజితకర్బుర॥ రా॥
మోదంబుననినునమ్మితిరారా। దయ। లేదనాపై నందకుమారా।

యూరి! సాధనమధుసూదననేనీదరిజేరితినీ మృదుపాదంబులు నాయహా దలకాదనకను మోపరహరి॥ రా॥

నీవేదారవనినమ్మితిశౌరి! గారీ! వరపూజితమురవైరి! సద్భా వముతోననీడక బ్రోవుముకమలా వరశరధి! వలయిలసదనాకవిజీ వన నతపావనహరి॥ రా॥

దాసజనుల బ్రోచెదవటనీవనే, దోసిలిడితియుది కన్గొనలేవు, వన! వానంబున నపకారముచేసిన కాకాసురుపై రోసంబున నిశితా స్త్రములేసిపిదప రక్షించిన॥ రా॥

వాసిగధరచొల్లేరుపురమున! నీవాసముగదజూడగ సతతము న! లక్ష్మీసఖితాడేపల్లి లక్ష్మీనరసింహాభి ధకాడ్భ్యాసుర హృత్పద్మ స్థితకేసరీబలభరాసురహిత॥ రాధి॥

పరివర్జితమన్మనోగతిఖేదా! నాథా! భవత్పదంబులకు నమ స్కరించుచున్నదాన.

సూ——పరివర్జితచే—నటీ! నటీ! చిరంజీవివై వర్ధిల్లుము. (అనియేమో యాలోచించి) కాంతా! యీవచ్చినమహాజనపుంగవులిచ్చలో మె చ్చునట్టుకొంతహిందూస్తానితో భాషింపుము)

నటి——చిత్తమాలాగేమాట్లాడెద

3. హిందూస్తాని——టప్పాజుల్వ

అప్నేకిస్వాస్తేముఝుతలబ్ కియ్యాహూ। హాజరీమజ్లిస్కేదిల్కీఅరజుకహూ॥ అప్నే॥ బందానవాజ్ యిస్తరీబ్కీమారుజాసునో-పుండాతరీకామేరాగానాసునేహైవునో॥ అప్నే॥ ఆజ్యేక్నాటక్కీరియ్యేఆప్కేయిజ్జాద్హై। తేజుసెఖేల్కేకమన్తామేరేదిల్పెహై॥ హాగ్ వఖ్తులక్ష్మీనారసింహా రాయునాంసఖి పరవర్ధిగార్చెల్లేటి సీతాపతిదే గానుఖీ, అప్నే॥

అజీఖావిన్ద్ ఆఫ్మేరెలియ్యే యాదుపర్మాయాతగ్ పిడిల్హా ఝ్మనీ వీణాగానవివోద్కే ముఝుమన్నాఅనందుపాయిధి అయిసేహోలత్ మేఆప్కేహుకుంతామీల్కార్నా పడా అయిందాక్యా యిష్టాదుయిన్

జిగేపర్ బెంచి కర్చి వర్ సీచర్ రోష్నీ మా జాద్ బై । క్యావ
ఝూఅహె లెమజ్లీ సీతప్రిఫావురీ కెంకర్ హూ వాహై మాలుంకర్నా చ
హాతీహూం (అనువాక్యంబులుకర్ణానందంబులు సేయుచుబిగ్గరగా.)

సూ—కస్తూరిగంధి నిప్పు డొప్పుగాపలికెదు పలుకులకు నాడెందబా నందంబొందియున్నయది. మనమీరాత్రి యొక్క యపూర్వనాటకంబు ప్రదర్శించెదమని యీసభాజనపుంగవు లనుదెంచి యున్నవారలు. వారలకింపుసొంపుకన్పింపసేయు తెరంగునీసామ్ము ని నమ్మియున్నవాడ కొమ్మా! బంగరుబొమ్మా!

ఉ. ఇయ్యెడ సత్కవీశ్వరు లంహీన యశస్కులైన పండితు
ల్నెయ్యపులర్చు గాయకులనేకులు వచ్చిరి పేశలోక్తులం
ద్దియ్యని మాటలుస్మిగులతేటగు నర్థముగల్గు నాటకం 4
బియ్యెడ లన్ప్రదర్శనమహేయగతి న్వ్యాససేయు సుందరీ!

బోటి! నేటిరేయి నాడిననాటకమే పూటపూట నోటులేక చూచుటకీ యెల్లర యుల్లంబులు పల్లవించునట్లు సేయుము. నీజాణతనంబును నీయొద్ద విద్దెగరచినవారల బుద్ధికౌశలంబులే గనుంగొనియెద.

నటి—పండితకుమారా మీరాజ్ఞాపించిన నాటకంబెయ్యదియో తెలియదయ్యె తెలిపినదియే ప్రదర్శింపించెద.

సూ—(అనిన గొంతసేపూరకుండి ప్రకాశముగా)

సీ. శ్రీమద్భువనగిరిసీమస్థనూతన
లేఖకాపురము చోళ్లేరు పురము
శబ్దశాస్త్రాదిశాస్త్రజ్ఞాన విద్వత్కు
మారభాసురము చోళ్లేరు పురము
లాలిత నవరసాలంకార విత్కవి
వారబంధురము చోళ్లేరు పురము
నిత్యసంగీత సాహిత్య విద్యారంభ
కారణాధరము చోళ్లేరు పురము

గీ. యిట్టిపురమున కాపురంబులరు వారు
తొలమివై డిక లౌకికమెఱుగు వారు
యమిత ధనధాన్య సంపదనలరు వారు
పశుపుకలవారు శ్రీతాడేపల్లివారు. 5

శా. ఆతాడేపలి వంశవార్ధి శశియైయానంద సంధాయియై
ఖ్యాతిన్నెందెను వెంకటాచలము విద్యన్రెండవ బ్రహ్మయై
పాతివ్రత్యమునం ధరుంధతి యనన్నాటిల్లు బాపమ్మతో
జేతోజాతుని కేళిఁగూడి గనియెన్నెన్నెప్పు దాసాహ్వయున్. 6

సీ. ఆమంత్రిశేఖరుండలరి వ్రాసిన వ్రాత
లాణి ముత్యంబులుగ్రాజి సేయు
ఆయమాత్యోత్తముండలతి బన్నినయుక్తి
యాయుగంధరు నైన నలతపెట్టు
ఆప్రధానాగ్రణియధికార మొనరించు
నేకుపింద్రునినైన నదూరముంచు
ఆ నియోగియొనర్చుదీనపోషణ లెల్ల
శ్రీవిష్ణుకైననుచిత్రమొసగు
గీ. నాయనయొనర్చు స్నాన సంధ్యాది విధులు
బ్రహ్మకైనను మదిదృష్టిపఱపు చుండు
నాసుగుణశాలి యెఱుగువిద్యాబలంబు
దేవతాచార్యు నయిననుధిక్కరించు. 7

సీ. ఎలమి విప్రులకన్నమింటిలో బెట్టినా
నెలకైన నాకలిగలుగ బోదు
పూని వేడుకతోడదానం బొసంగినా
యెవ్వరి యాచించరేటి దాక
యిచ్చెద ననుచువ్రాక్రుచ్చినా నదిశిలా
క్షర శాసనంబయిజరుగు చుండు

కానిమ్మనుచు శిరః◆కంపంబు చేసినా
నదిమనో భల్లమై◆మెదలు చుండు
గీ. కన్ను లాగి విప్పి చూచెనా◆కఠిన శత్రు
జాలమయినను బింకము◆ల్జారి యుండు
రట్టి దాసయ్య మంత్రికిఁ దైన వార
శియుగంబున గలరె మహీస్థలమున. 8

శా. తీయన్నాని పుదంబు నన్ననులు మక్షైదారు వా దేశ పాం
డ్యాయుంచు న్నలకర్ణి యుంచును పెనక్స్వాద్ధో పెుకద్దంబటం
చాయావేళల నెన్నుచుండఁగ పాతంబై దోపనుద్యో గమం 9
దేయాక్షేపణ జెందనీక మెలగెన్హెచ్చైన సత్యంబునన్.
ఉ. తండ్రి తరంబుకంటె ఘనధార్మికుడై ఘనకీర్తి దిక్కుల
న్నింద్రిలవైరి భంజన రతిన్దన కెవ్వడు నీడులేక పె
క్కింద్ర ధరా సురోత్తములకు కాంచన రౌప్యముఖాదిదానము
లుండ్రిలకిచ్చి బ్రోచె రతిఁ గోవిదు డాయన నెన్నశక్యమే. 10
క. సమ్మతితోడుత మహాల
క్ష్మమ్మ వధూమణిని సత్య◆శౌచస్థితిధా
మమ్మయితగు వెంకటల
క్ష్మమ్మాదుల బెండ్లియాడె నతిసుందరులన్. 11

ఉ. ఆమహా లక్ష్మమాంబ పతియం దతిభక్తి జెలంగ సీతము
నాని ముని గొల్చురీతి నిక◆రంబల రార పతిన్భజించుచు
నోమలగాత్రియై యువతికోటి నుతింప జరించె సద్గుణ
స్తోమము శౌచశీలములు◆సొంపు నిలుంపులు చూచి మెచ్చఁగన్. 12
సీ. అత్యంత పతిభక్తి ననసూయ యనవచ్చు
శుచి నరుంధతి కీడుఁ జొన్ప వచ్చు
వితతక్షమకు చంద్రమతియని యనవచ్చు
చెల్వమందున రతి◆జెప్పవచ్చు

చిరధనంబునను లక్ష్మికి సాటియనవచ్చు
భోగమందున శచికిఁ బోల్పవచ్చు
వాక్సౌమ్యవృత్తి నవ్వాణియనఁగ వచ్చు
గురుకాంతి గౌరితోఁ గూర్పవచ్చు

గీ. ననఁగ షడ్గుణయుక్తయై యతిథి జనుల
కన్నపానాదు లొసఁగుచు నలరుచుండు
కుంతలాకార రోలంబ కగుణ కదంబ
లాలితనితంబ శ్రీమహాలక్ష్మమాంబ. 13

క. కరకీర్తి యాసఖీమణి
గరమరుదుగ గూడికాంచెఁ గతినారిచమూ
నరసింహునివరలక్ష్మీ
నరసింహరాయ సుకవినాయకఁ గేయున్. 14

శా. ఆ లక్ష్మి నరసింహరాయఁ డొగి సౌభాగ్యంబందె చౌషష్టివి
ద్యాలంబుండయి తండ్రిసేయఁబడు కార్యంబు ల్వెసన్దీర్పఁగా
నీలాజాలముఁగా కచే హరులకున్నిత్యంబు దాబోవుచు
న్జాలెమ్మెచ్చు నృపాలసద్ధృఢల భాస్వద్రీతి మాట్లాడఁగన్. 15

సీ. పోలువుగానే మంత్రిభోజన సమయంబు
విప్ర సంకీర్ణమై వెలయుచుండు
సరవితోనే గుణశాలి సద్ధామంబు
బంధు సంకీర్ణమై బరఁగుచుండు
వేడ్కతోనే ధర్మవిధుని పర్యంకంబు
పుత్ర సంకీర్ణమై పొల్చుచుండు
వరుసతోనే ధైర్యవంతుని సద్బుద్ధి
ధర్మ సంకీర్ణమై దనరుచుండు

గీ. వెలయ నేమీటి ధనశాల లలి జెలంగ
ద్రవ్యసంకీర్ణమై మహోత్కలిక మించు

పఱిగ నెవని హజారంబు వగలు తేయు
శూరసంకీర్ణమై జనస్తుతుల గాంచు. 16

సీ. తనకరపాళిస య్యాన ప్రకాశముజేసి
విబుధులకోరికె ల్వెక్కుదీర్చు
తనరాజ ధర్మము ల్తక్కలిక నిరూపించి
పరచక్రరాజికి భయము సూప
తనశీతలస్వభా వని యతిపై కొని
పాంథసందోహంబు పఱుగ బెంప
తనపుష్కర విహార ధారాళపద్ధతి
చూపరపెందుకు చోద్యమొసగ

గీ. తనదుచెల్వంబు గురుపత్ని దవిలిమెచ్చ
తనభవమునకు జనకుడిం పెనసి బొంగ
రమ్యగతిలక్ష్మి నరసింహ రాయచంద్రు
డలరెసత్కవి నికరకమయ్యారె యనగ. 17

మ. హరిభోగంబు ధనుంజయప్రభయు ధర్మాసూన సత్యంబు ధు
ర్భరనై యుత్పతి ధైర్యమున్వరుణ శుంభత్సౌర్య మాయుంజనీ
వరపోత్రిద్యశ్బల ముగ్గుబేరధనము న్సర్గాభ సద్భాతియు
న్థరలక్ష్మీ నరసింహారాయుడు గొనెన్దత్తత్కృపా పాత్రుడై.

సీ. తనతుపాకి గభిల్లను మోతవైరిక
ర్ణద్వారములు బధిరంబుజొన్ప
తనదానధారావితానంబు వంకలై
బఱిగిశాల్వ డగాకఁ బాఱుచుండ
తనయుక్తి ప్రాతకెంతయు నర్థమొగి చేసి
శానశేక భూపాలు లెనసి యడుగ
తనధైర్యమహిమకు మొన యిప్వాకను భాను
లాగిలడాయి తొలంగి యూరకుండ

గీ. తనముఖాబ్జము గనుఁగొన్నఁ జెనటు లయిన
మాంచిమాటల మించి మన్నించి ప్రోవ
క్షితిని చొల్లేటి నుండు లక్ష్మీనృసింహ
రాయునకు సాటియె మంత్రిరాజియెల్ల. 19

ఉ. లాలితమూర్తి తాఁ దేపలి లక్ష్మీనృసింహ నియోగి కీర్తి గో
పాలికి కామపాలికి కరపాలికి పాండుర వర్ణచంద్రికా
పాలికి సర్వభూతి మృగపాలికి వార్ధిపాలి కండ భూ
పాలికి హీరపాలి కవిపాలికి తాఁ రుచులిచ్చు నిత్యమున్. 20

ఉ. ఆతఁడు వీరకాంతుల మహోన్నతుఁడు సంభవుఁడంత మంత్రికిన్
కూతురి కుండిన ప్రభుని కూతురి గట్టుల రేని కూర్మియా
కూతురి బోలినట్టు సుమకోమలియై తగు శ్యామలాంబికా
శీతకరాస్య పెండ్లియయె పతిమానసి పెండ్లియా క్రియన్ 21

క. వారిద్దరెలమి గాంచిరి
కోరికలలరార ముద్దుఁ గొడుకొక్కరుని
న్నారాకారుని సుజనా
ధారుని మృత్యుంజయాభిధానుని గరిమన్ 22

సీ. కల్వలచెలి కాని గాంచు సంద్రము మాడ్కి
సరిజయింతుని గన్న శచి తెఱగున
నలకూబరుని గన్న యలకాధిపతి రీతి
లలిని మారుని గన్న లక్ష్మి తేవ
శరజన్ము గాంచిన శంకరు చందాన
గజముఖు గాంచిన గౌరి భాతి
కరమొప్పు కృష్ణుని గాంచు నందుని పోల్కి
నమరేశ్వరుని గన్న యదితిలీల
గీ. యాంజనేయుని గాంచిన యంజనివలె
సరవి రఘురాముగన్న కౌసల్య గతిని

పేర్మి నర చేతులలో నుంచి పెంచుకొనుచు
మురియుచుండిరి యా వధూవరులు వేడ్క. 23

క. పతి చిత్తమరసి మెదలుచు
పతియే దైవంబటంచుఁ బతిగతియంచు
న్బతియే భూషణమనుచును
నతివేడుక నుండు శ్యామలాంబ పతికడన్. 24

క. మృత్యుంజయరాయుం డా
న్నత్వముగా చదువుకొనుచు నార్య శ్రేణి
న్నిత్యంబుగొల్చి వారల
సత్యాశీర్వచన లబ్ధి జరియించు ధరన్. 25

క. ప్రేమించిన యాచార్యుం
డై మదికమృతంబు చూపి యలరన్ముల శ్రీ
రామబ్రహ్మము రెండవ
రామబ్రహ్మం బటంచు రహిఁ జెప్పదగున్. 26

ఏవంవిధగుణగణ భూషణుండై తాడేపల్లి లక్ష్మీనరసింహరాయాగ్రే
సరుండొక్కనాడు.

సీ. ఆకిళ్ళ సూర్యనారాయణ శాస్త్రిశా
స్త్రప్రసంగములు జరుపుచుండ
జ్ఞాతులై శ్రీరామ ఘనుఁడును లక్ష్మీనా
రాయణు లిద్దరు రహిఁ జెలంగ
శ్యాలకుండై కీర్తి నలరిన బీరకా
యల రామారావు నేర్పులు ఘటింప
వేడ్క న్యాయమతు ఖాను వేంకటరాయుఁడు
మనసిచ్చి కూరిమి మాటలాడ,

గీ. రమ్యపతంగి నరసింహరావు కూర్మి
దొరయ తాలేక ప్రసంగముల్ జరుపుచుండ

గీ. మున్ను వంశోద్భవుండయి బుధుల జూచి
సంతసించెడు శ్రీమద నంత రెడ్డి
భూరిగుణుడై వెలంగెడి సారబుద్ధి
రత్న రెడ్డియు సంతోషరాశి దేల. 32

కం. అగణితమగు సంపదచే
దగు రామిడి నరసిరెడ్డి దర్పోద్ధతుడై
మిగులు కిషన్ సింగును సాం
పుగ మాటల నాడుకొనుచు పూర్ణత నుండన్. 33

క. లలినొప్పెడి లక్ష్మణసిం
గలకాచము చంద్రయాఖ్యులతి వేడుకతో
వలనుగ తమతమ కార్యము
లలరుచు చెప్పుచును నుండ నాశ్చర్యముగన్. 34

క. నెయ్యమున పాక పద్ధతి
సయ్యన నలభీమ నృపులచక్కగ సరి రా
నియ్యని పిల్లల మరి కో
టయ్యయు తనుగొల్చి మాటలాడుచు నుండన్. 35

సీ. వసుధ తాడేపలి వరరాజయాఖ్య ప్ర
ధాని యెవ్వని తండ్రి తండ్రి తండ్రి
ధరకవి పద్మభాస్కర వేంకటాచల
ధార్మికుండే మంత్రి తండ్రి తండ్రి
నిస్తుల కీర్తి ప్రశస్తుడై చెల్వొందు
దాసయ్య పంతులే ధన్యు తండ్రి
రమ్యమృత్యుంజయ రాట్కిశోరాగ్రణి
కేయ మాత్యోత్తముండెలమి తండ్రి
గీ. యట్టి లక్ష్మీనృసింహరాయాగ్రగణ్యు
డాప్త బంధు ప్రముఖుల నెయ్యమున గూడి

యొక్కనాఁడు కుతూహలంబుప్పతిల్ల
యుక్త నాటక మొకటిఁ జేయుమనికోర. 36

ఇవ్విధంబున వజ్రవైఢూర్య గోమేధికేంద్ర నీలమరకత మాణిక్య ప్రభృతి రత్న స్థగిత దేహళీ కవాటస్తంభ సంభృతంబై, నానావిధచిత్రపుత్రికావిలసితంబై, ఇంద్రుని వైజయంతంబు న్దిరస్కరించుసభామంటపంబున ననేక విద్వత్కవిపాఠక నటవిటగాయక దాసదాసీ వీరభటసంయుతుండై పేరోలగంబుండి యొక్కనాఁడు.

శా. మాచొల్లేరు రఘుప్రవీరు కృతియై మాధుర్య వాగ్జాలమై
శ్రీచెన్నొందెడి యుక్తయుక్తి యుతమై శృంగార శయ్యాఢ్యమై
రాచత్రెచ్చెడి యొక్కనాటకము తోరంబొప్పగా చెప్పుమా
నీచాతుర్యము దోపసత్కవివరా నేదించు వాక్రుచ్చినన్ 37

సంతసించి తదీయ బహూకృత తాంబూల జాంబూనదాంబరాభరణాదికంబులు గ్రహించి

గీ. మిత్రవిందా సరోరుహపత్రనేత్ర
పరిణయము నాటకంబుగాఁ బ్రచురపరిచె
ధరణిసూరప రాడ్వేంకటరమణకవి
యుడిదెనేడు ప్రదర్శింపుమబ్జవదన. 38
(అనిన దరహసిత వదనారవిందయై చేతులు జోడించి)

నటీ—నిజమునిజము! సరస కవితా చమత్కృతిచే పరిఢవిల్లుచున్న యీనాటకంబుండ నదియేదియో సెలవియ్యమనిమిమ్ము గోరడము నాకెంత బుద్ధిమాంద్యంబుచూపట్టె, నిది ప్రథమ తప్పితంబుగా నెంచి క్షమాపణయొనర్ప కోరుచున్నదాన.

సూ—మంచిది నీవిసంశయం బుంచుకొనక నాటక ప్రదర్శనమునకు ముందు శరదాగమంబు వర్ణించు మీదనీ ప్రౌఢత్వంబు కనుగొనియెద.

నటి—చిత్తమాలాగేవర్ణించెద.

సీ. మలినంబులేని॥నిర్మలవస్త్రిమనము బ్బు
పోయిమిన్నెప్పుడు॥పొల్పుమీరు
గాలిపై పైపోక॥దూలిఖస్థలి బాసి
ఘనజాలమేకాల॥మునవడంగు
తెల్లనిమేల్కట్ల॥దివ్వరుము త్తెములన
నాకసంబున జుక్క॥లమరునెపుడు
నిర్మలచంద్రికా॥నిచయంబుతో చందురి
పేదినంబులలోన॥నింపుచూపు

గీ. పాలికులచే లవిత్రంబు॥లోలిఁజూచి
సరవిభయమొంది కలమాది॥సస్యవం క్తి
మించిమ్రొక్కెడు గతితల॥ల్వంచు నెన్న
దట్టిశరదర్తువును నెన్న॥నానెనాడు. 39

హిందుస్థాని—ఏకతాళము.

శరదర్తువర్ణన సేయుగ దరమానే సుందరరూపక।
యోసురలకునైనభూ సురులకునైన॥ శర॥
కరముమీర పండువెన్నెలగాయుచుండుదిక్కుల।
మురువుదోప మగలునాంధ్ర ముద్దుగొందురు చెక్కుల॥ శర॥
నిర్మలంబౌజలములతో నిండియుండుకొలుకులు।
పేర్మితోడబల్కుచుండు పెక్కుమార్లు చిల్కలు॥శర॥
చేరదీసితాదేవలి లక్ష్మీనృసింహ్వారాయుని।
కోరికలుదీరుచు చొల్లేరు హరివాహ్వాయును॥శర॥

ఆహా! ధరాతలంబునంగల ప్రతిగ్రామపట్టణ జనపదంబుల నాపురంబులు సేయు వారలసేద్యంబులచే పుట్టిపెరిగి దట్టమయినకల మాది సస్యసంఘమంజరీ పుంజంబుల దమతమ పుత్రమిత్ర కళత్రంబులతో వాసిమీఱ డాసిచంచువులతోదుంచి, మొసవిపసగల మేనులతో, నాపాలంబుల గాపాడనెంచి మంచలపైనున్న వన్నెలాడులవ

దవులు దాండవండులవలెదోప నాపరాని సంతోషంబుల కలుక్యాన న్గరిచినవార లుల్కిపడి యదలించిన బెదరి సమీపస్థ భూరుహాగ్రంబులపై చేరి పలుకుచున్న చిలుకలచే ప్రకాశించునదియు, నిండానిండి యుండుకాండంబు లంతకంత కంతరాయంబై పోవబోవ కప్పురంపు టరుగుల మగరాలగోడలమేడలకు గట్టినమెట్టులవలె దట్టముగాకన్పట్టుసైకత ప్రదేశంబులచేదీపించు నదీనదంబులచే నొప్పినదియు గొప్పగొప్పయడవుల బడలికలేక తపంబులొనర్పు జటిశేఖరుల కప్పురగంధు లప్పుడప్పుడుతప్పక వినోదసంజాయమానమానసంబుల తమతమ కలశంబుల నిలిచియున్న సలిలంబులచేపెంచ పెద్దపెరగి బొద్దులుకనుపించురసాల నారికేళాది ధరాజసంతానంబులచే వింతలుగన్పించునదియు, తరణికిరణ ప్రసారణంబునకును వాతసంచారంబునకును చోటివ్వక వాటమయిన లతాపత్ర పుష్పగుచ్ఛంబుల నల్లుకొని పెల్లివిరిసిన మల్లికాదిక్ష్మాజరాజంబుచే రాజిల్లువనంబులచే రంజిల్లునదియు, యిందీవరకల్హార పుండరీకప్రభృతి నీరజంబుల నూరుచున్నమకరందంబుల పొట్టలనిండారకుట్టులపుట్టతాగి సోలిసొక్కుచు నెక్కడచూచినంతానవై ఝుమ్మఝుమ్మనన్ మ్రోయుతుమ్మెద మొత్తములచే యమ్మొగుల్కొచున్నదియునగు శరత్కాలంబును నాశక్తికొలది వర్ణించితి, నికమీద నేనేమిపనులొనరింపవలయునో తెలియచెప్పవలయుమహాత్మా !

సూ—బాలా! సుగుణాలవాల ! ఇప్పుడునీచేవర్ణింపబడిన శరదృతు ప్రభావంబీయందరి డెందంబులానందింపజేసి నట్టు వీరినెమ్మొములపై మెలయుచున్న చిరునగవులేసూచించుచున్న యవీనాటకప్రదర్శనంబున కిప్పటికేకాలాతిక్రమణ దోషంబాపాదించియున్న యదిగాన నీవింకజని యేయేకాలంబున కేయేవేషధారుల నాయత్తపరుపవలయునో నాయాకాలంబుల కాయావేషధారుల సిద్ధపరచుము.

(అనిన నటినిష్క్రమించును)

(రంగము-అవంతినగరము విందధరాధవునికొల్వు)

(వరాక్)—ఉదగ్ర స్వభుజబలనిర్లక్ష్మీకృత సకల రాజాధిరాజప్రతాపసముంచిత కలాపస్వాతులదీప బహువరాక్ అతీక్ష్ణకటాక్షవీక్షణ ప్రమోదిత నిజదేశ స్తనానావిధమనుష్యవితాన సమస్తసుగుణగణనిధాన యాచక సందోహ పరితృప్యమాణదాన బహువరాక్ రూపవతీ హృదయారవింద మకరందబిందు సందోహ పాన మదవదిందిందిరాయమానసపంచసాయక విలాససుందర మందహాసబహువరాక్.

రా—(కోరమీసంబు వడివేయుచు)నర్మసచివా! మంత్రిసత్తమా!

మం—చిత్తము రాజోత్తమ

తోడి సంవాదము.

రా—సచివరాష్ట్రమునకుశుభమా। తెల్పుము నాకు। రుచిజనించుగా।
వచనములను దెల్పుము॥సచి॥

మం—శుభము దేశమునకున్నృపతి। కవిరాజగతి। యుభయములగు సుజను
లలరుచుండు రెపుడు॥శుభ॥

రా—కుజనులెవరయినపురిమందురా। మనమాటవిందురా। ద్విజులదే
వపూజజెలగునెనిజముగ॥సచి॥

మం—స్వకులధర్మములెవరుబాయక। నున్నారువేడుక ప్రకటితగతి
సంపదలదగియుండిరి॥శు॥

రా—పరనృపభటభయములేదుగా। యపకీర్తిరాదుగా॥ తరుణులుభ
ర్తలు సరసలనుందురె॥సచి॥

మం—దేనజూచిననాకుకొరత। దోచదుమదిలో। మానవేశయనుమా
నముమానుము॥శుభ॥

రా—కవులెవరైనజూడవచ్చిరే। ననుకీర్తించిరే। తవిలికొత్తవింత
లుకనుగొంటిరె॥స॥

మం—ధరణిచొల్లేరు పురినిలచి। లక్ష్మీనరశింహా। వరదుడైనహాని
సిరులొసగునువడి॥శు॥

రాజన్యశేఖరా ! స్వరాష్ట్రంబునకు పరరాష్ట్ర భయుంబించు కయుయిన జొరనీక పూర్వోర్వీనాయకులగు గయాంబరీష ప్రముఖులరీతి రక్షించుచున్నవాఁడవు, భవత్ప్రతాపం బెంతని వర్ణింతు, శాంతగుణాలంకృతచిత్త!

రా—శహబాసు ! మంత్రిసత్తమా ! నీవంటి నర్మసచివుం డుండు టచేగదా నావంటిధరావరుని పరాక్రమంబు ప్రకాశించుట.

మం—ధరానాథ యికమీద మనమేమికార్యంబు లొనరించవలయునో సెలవీయుడు.

రా—ప్రస్తుతమవసరమయిన వ్యవహారంబు లున్నట్లునీచెప్పెడు సదుత్తరంబులవలన కనుపించవు, మన నగరంబున కాపురంబున్న వారాంగనలలో రూపయౌవన కళాగంభీర్యముచేనొప్పి భరతగానవిద్యా కౌశలంబుల మెప్పించగల నొక్కదాని రప్పించి ప్రొద్దుపుచ్చుము.

మం—చిత్తమాలాగే రావించెద

(వారాంగనప్రవేశించి అలికస్థలివిన్యస్తహస్తయుగళయై)

వా—ఉ. దండము రాజచంద్రజనతానుతసద్గుణసాంద్ర వైరివే
దండమదఘ్నసింహవసుధాజనకామ్యదరంహభూరికో
దండధరావతంసపరిదండితసత్కులపాంసబోవుమా
పండితమిత్రపండితవిపాలకపత్రసుధాప్రభాషణా. 40

ధరావర పుండరీక ! నాదండంబులు గైకొను సరసుండవని నీయుండజేరితి మాయుండయిన నీదండనుండ సుందరుం డనిపేరుండు నే వేదండరిపుసమానశౌర్య !

(అనిపలుకు పెలకలికిపలుకులకలరి కొరమీసంబులు వడవేయుచుదానిని చక్కగాజూచిప్రకాశముగా)

రా—మ. చిగురున్బోలిననీదువాతెరకువాసిన్జందురుండంచున
మృగజూపట్టెడినీదుమోమునకు శ్యామంబైననీవేణికి

న్నిగుడౌనీచనుదోయికిన్నడియనాఁబెర్కొన్న నీనాభికి
న్నగవ్రప్పారెదు సుంగళంబులగు కాం॰ తానిక్కమెల్లప్పుడున్.

వా—రవిప్రతాపభూపా! నేనొక్కరాగం బాలాపించి యొక్కజా
విడికి హస్తవిన్యాసంబుజూపెద సెలవిండు (అనిన దరహాసి
త వదనారవిందుండై)

రా—కానిమ్ము నీనెమ్మనమ్ము నభయమ్ము నబోనిమ్ము.
(తోడిరాగం బాలాపించి జావిడీకభినయించబూనును)

6 అపురూపం—టక ఏకతాళము.

రారాముదముగా నాజారా! నా యింటికి వేగమే ॥ రారా॥
యేరికోరిన నారిపక్కకు జేరిమదికసిదీర చేయవదా ॥ రా॥
మాలిమితో బలిమాలినసుకృపమాలితివివనమాలిమేలిమిగ॥ రారా॥
కానిమానినిపైన కూరిమిపూని తాలిచెలిమానితివి భళీ ॥ రారా॥
చేరిలక్ష్మీనృసింహ రాయునికోరి బ్రోచుచోళపురీశ్వరా॥ రారా॥

మహాప్రభో! దేవరవారనుగ్రహించితిరేని యింకొక జావి
డీకిహస్తవిన్యాసంబుచూపించెద (అనినముసిముసి నగవుతో)

రా—మంత్రిమతాకర్య! స్వతంత్రి! ఈయాటచేడియయాటపాటల
లోమేటి వాటమయిన నీటుగలబోటి ఈబోటితోటి సాటిగ
ల నీటులాడులనేనేడకనివిని యుండలేదుగాన ఈనారికోరిన
కోర్కెలొసంగిపొసంగవీడ్కొల్పుము.

మం—ధరాధవచంద్ర! భవదాజ్ఞానుసారంబుగా నావెలవెలందిని
పంపించియున్నవాడ.

(ఇట్టున్న సమయంబున హటాత్తుగా భీకరాకారంబుతో దుర్యో
ధనచక్రవర్తి భటుండు ప్రవేశించి రౌద్రముతో)

చ. మఱచితిరేనృపాలనృప॰ మండలికిన్విభుడై యొకప్పుడు
న్దలుగనిసంపదల్గలిగి॰ తద్దయుఁగొంగలబట్టిపెత్తల
ల్దఱిగెడి రాజరాజునకు॰ దాత్తతనిచ్చెడి కాన్కలివ్వక
న్వెలుసుతనంబుచేసితివి॰ పెద్దయితే భళియింతలోపలన్ 42

సీ. నిరుపమప్రబలసం♦గరశౌర్యసంపద
వెలుగొందుద్రుపదభూ♦విభునకంటె
కలిమియు రాజ్యంబు♦గలిగి యుద్ధంబుల
బలశాలియగు బృహ♦ద్బలునికంటె
బలములక్షౌహిణు♦ల్బలసి గొల్వగ పెద్ద
చెలినయాశిశు♦పాలుకంటె
హరినైన లెక్కసే♦యక విదర్భపురంబు
నేలెడు రుక్మిమ♦హీశుకంటె

గీ. యెక్కుడే నీవు వారలు♦శక్తిలేక
నిర్జయంబైన పన్నుల♦న్నియును పెద్ద
పెద్దయేనుగలపై నుంచి♦ముద్దుమీఱ
పంపిర యొ నీకు దయ్యంబు♦బట్టెనే మొ. 43

నీ కట్టెత్రాళ్ళు నీవే పెన్చుకొని యున్నవాడవు. ఆ మన్నె దొరనిన్నేమి చేసితే నీవేమి సేయగలవాడవు? నీవర్ధరథుండవు. నీవెంత నీబలంబెంత! ఛీ! ఛీ! నీమొగంబుచూడకూడ దీయుత్తరంబుచూచికొమ్ము (అని యుత్తరంబిచ్చిన మెల్లమెల్లగా చదువుకొని దీనాననుండై తలయూచుకొని అందరునిష్క్రమింతురు).

ప్రథమాంకము సంపూర్ణము.

# మిత్రవిందాపరిణయనాటకము.

## ద్వితీయాంకము.

(రంగము. విందుడు, అనువిందుడు, నర్మసచివుడు, ఆకాశమున బ్రకాశముగా.)




దన్నృపాల నీవు కురువీరునితో బహువేడ్కఁ దోప సం
బంధముసేయ బూనితది; బాల్యమునే కలనైన దేవకీ
నందనుఁడుండ వేరొకఁడు నాయకుఁడౌనె లసత్ప్రమోదస
ద్బాంధవ బృందకైరవసుధాకర దర్శిత కుందసుమిత్రవిం
దకా. 1

విం—ఆశ్చర్యమగ్నమానసుండై యేమిచిత్రము! ఈనుడువులు గగనవాణి పలికినది కాబోలు లేనిచో నన్యులెవ్వరిట్లు చెప్పగలరు. (అని యోచించునెడ ననువిందుండు లేచి శంకితహృదయారవిందుండై కొంతసేపూరకుండియున్నఁ గనుంగొని గట్టిగా.)

అ—శా. ఆకాశంబిటు పల్కనేల వినగా నాశ్చర్యముల్ దోపగా
నీకా కౌరవరాజవల్లభునకున్ నిర్ఛిద్రసఖ్యంబు ము
న్నే కాలంబున గల్గెదాని వినగా నే వేడెద న్వేడ్కచే
నాకాకారణ మెల్ల దెల్పగదవే నాయన్న న్యాయంబుగన్. 2

అగ్రజన్మ! నాకా కారణంబును సమగ్రంబుగా ననుగ్రహింపుము.

విం—(వ్యగ్రమానమానసుండై తనలో) నేనప్పుడు వారితో చెప్పిన పలుకు లీతనితో చెప్పిన నొప్పుకొనునో యొప్పుకొనడో యొ

ప్పినాయెుబ్బుకొనకపోయినా చెప్పకతప్పదు, చెప్పకపోయిత్తే కప్పురగంధికళ్యాణం బెట్టులోనగూడు, నీతండు పాండవపక్షపాతి. పాండవులాసుయోధనున కనుకూలురుకారనుసందియం బందరికిఁ దెల్లమియేకదా, నిద్రబోయినవారి లేపిన తెఱంగున నందఱువిన నాకాశవాణి తెలియబలికెనయినగానిమ్ము మీద జూచుకొనియెదనని) తమ్ముఁడా! అనువింబా! చక్కఁగావినుము. చెప్పెద.

సీ. రాజరాజగు కురుక్ష్మారాజున కేటేట
మనమియ్యవలసినధన మొసంగ
కుండిన నతడల్గి దండిఁ గోరుని నొక
నంపినవాఁడు మహోగ్రహమున
వచ్చిదురూక్తులఁ బ్వారిగానను బల్కి
వారియుత్తరమియ్యఁ జీరిచూడ
వెంటనే రమ్మను విషమాక్షరములందు
కనుపట్టినను మేనుఁ గంపమొదవ
గీ. యేరికని చెప్పజాలక యేగియుంటి
భూరిభయభక్తి యుప్పారఁ వారిగంటి
నేతపల్కిన పల్కులన్నియునువింటి
నుచిత మనుచితమనక నేనూరకుంటి. 3

అంతట నా రాజపుంగవుం డభంగురహాస రసోల్లసితముఖుండై ఏమోయి విందుఁడా! మేమడిగిన సుడుపుల కిదియగు నిదికాదను వాక్యం బొక్కటయిన చెప్పక బెల్లముగొట్టిన రాయివలెనున్నవాడవా పురందరనందనుం డన్నయైయుండ నీవేదండపురాధినాథుం డేమిసేయఁగలవాడని మదంబొదవిన యెదతోనున్నట్టు తోచుచున్నయది. ఆదండిమగలే కొండలపాలై యుండ వారి ప్రాభవంబు నీకేమిలాభంబుగాన మొల్లగంధియగు నీచెల్లెలిని నాతమ్ముని పిల్లనికిచ్చి

హెచ్చిన మచ్చికతో నా యిచ్చదీర్చి మనుమని వత్తివత్తి పలికిన నా డెందంబందు జెందిసుందరాంగి నిచ్చెదనని వచ్చితి లేకున్న యీకన్నెతో రాజ్యంబు చేకొనునిందు కెందును సందియంబు లేదు. (అనినన్దొండంబు వట్టియీడ్చినమండిపడు వేదండంబురీతి గద్దియపైనుండి దిగ్గనలేచి)

అను—సీ. అమరేంద్రముఖులతో • నాహవం బొనరించి
ఖాండవంచేర్చిన • ఘనుడెవండు
మాయాకిరాతుడై • మలసినహరుని మె
ప్పించి పాశుపతంబు • గాంచె నెవడు
కాలకేయనివాత • కవచుల నొంటియై
మ్రందించి కోటీర • మందె నెవడు
ఘోషయాత్రలో దన్ను • గొనిచన్న గంధర్వు
నదలించి విడిపించి • నదియెవండు
గీ. ఇంతలోపల మఱచెనే • యింద్రతనయు
శౌర్యధైర్యాది గుణముల • సార మెల్ల
ధనము హెచ్చినమద మెచ్చు • ననెడి మాట
తప్పునే యెరికైననీ • ధరణియందు. 4
మ. అదియెట్లుండె నటుండనిమ్ము మనమ • ర్యాదైన యోచింపకు
న్మదవృత్తి న్విలిపించి పిల్లనడుగ • న్న్యాయంబె వీఁడొక్క పె
ద్దదొరే దాసిసుతుండు తోడఁబలిన • న్నానేమి టన్నొందునో
మదరాజన్యులవల్ల నప్పనముల • న్మర్యాదతో నెల్లెడన్. 5

అప్పుడు నీకెందుకు నోరులేవకున్నయది యోడోచకున్నయుది. ద్రౌపదీ స్వయంవరంబు మొదలయిన స్థలంబులలో దానుపొందిన పరాభవంబులేల నుదహరించకుంటివో యప్పుడతండు జంపునని కాబోలు. రాజులకు చచ్చుట చంపుట సమానధర్మంబులని మీ రెన్నడువిని యుండరేమో యీపరమకిరాతకసుతునకు మనసరోజాక్షి నిచ్చుట కంటెచిచ్చులో పెట్టుట మేలుగాదె! యచ్చపలనయనకుం దగినవా

రుండు కృష్ణుండుతప్ప మనుష్యమాత్రుండొకండు కలండే యని నా యభిప్రాయంబు తెలియపర్చుచున్నవాడ (అనిన సంచలిత మనఃపం కజుండై తమ్మునివంక జూచి.)

క. పిల్లడవునీవు కసరున
ప్రల్లదములు పల్కనవియొ♦ భాష్యములనినా
యుల్లమున నమ్మ్రిననుబుధు
లెల్లను హర్షింతురయ్య♦ హేయములనకన్. 6

క. చతురంభోధి పరీవృత
క్షితియెల్లను నేలునట్టి♦ శ్రీమంతునితో
ప్రతిహతముగ మాట్లాడిన
కుతుకలు కోయించకున్నె♦ కుయ్యోయనగన్. 7

ఉ. ఎక్కడికృష్ణుఁ డాతఁడొక♦ యేలిక యే మన కెన్నడేనియు
శ్శక్తి పరాక్రమంబులజె♦లంగుచుబానల బండనెద్దుల
న్నిక్కులపెట్టి చంపుటలు♦ చిత్రములయ్యెనెనీకు మంచిరా
జెక్కుడజిక్కి జెల్లెలిని♦ నిచ్చినచూపరు లెన్నకుందురే. 8

ఆహా తమ్ముడా! యనువిదుండా! రాజరాజై మహా ప్రఖ్యాతి బొందిన దుర్యోధనచక్రవర్తితో శత్రుత్వంబును, రాజ్యవిహీనుండై యడుగాజెటలో బెఱిగిన కృష్ణునితో మిత్రత్వంబును కొఱవితో తలగోకికొనినట్లగును గాన నాయిష్టంబునకు కష్టంబుచెప్పకుము.

(అని తమ్మునిమొగంబునందు దృష్టినిడి మేఘగంభీర భాషణంబులతో.)

క. పెద్దయొనరించు కార్యము
వద్దని చెడగొట్టపిల్ల♦ వానికితగునే
యెద్దో జేసితిదానిని
ముద్దుగ గనుగొమ్ము యింతకమూఖఱంబేలా? 9

(అనిన తోక త్రొక్కిన నెగిరిపడుపిల్ల త్రాచువలె బుసకొట్టుచు చేతికరవాలంబు మెఱపించుచు)

అ—అగ్రజా! విందభూభుజా.

ఉ. ముద్దులచెల్లెనయ్యొ పెడమూర్ఖుని పుత్రున కిత్తునంచునీ
బుద్ధికినెట్లు తోఁచెనటు♦పోయెనుముందటి తెల్వితోఁటి
నీపెద్దతనంబి కెవ్వనికి♦పెద్దఁబృకృష్ణుని కిచ్చువాడె బ
ల్పెద్దగుటబ్రమేయతఁడు♦పిన్నతనంబున నున్నచూడఁగన్. 10

సీ. లక్కయింటనుబెట్టి♦లబిమనపెదతల్లి
కొమరులగాల్చిన♦కూళమతులు
నిద్రఁబోయెడుభీము♦నిరధిలోఁ దాళ్ళ
కట్టిముంపించిన♦కలుషరతులు
ద్రౌపదీపరిణయో♦త్సవవేళఁబార్థును
నిందించునట్టి♦దుర్నీతియుతులు
కష్టంబులెప్పుడు♦కల్పించివారల
దూరదోయించిన♦ద్రోహాగతులు
గీ. ఇట్టివారలతోఁపొత్తు♦బెట్టుకన్న
ఇట్టినీదిట్టతనము నేఁ♦డుట్టిపడియె
చిట్టచివరకుతల్లితోఁ♦బుట్టువులకు
పట్టలేనట్టిపనితల♦పెట్టితహహ. 11

(అనిన పలుకులు చెవులకుములుకులై దోఁప పండ్లు పటపటన్గొఱుకుచున్దమ్మునిదృణీకరించి చేతికత్తి విసరుచు మంత్రి మొగంబు చూచి)

విం—ఉ. వింటివె వీనిమాటలున♦వీనములై కనుపట్టెనల్లము
క్కంటినినైన భోరిచెన♦కందగు విక్రములున్నవారువా
రింటను నిట్టివారిని హి♦హీయని పండ్లిగిలించిపల్కిన
న్గెంటరెరాజ్య మున్నికులొ♦గ్గానిభూపతులెల్లనవ్వఁగన్.
సీ. తమపాలుసాధింపఁదరము కాకనుకదా
పాండవు లడవిలోఁపల బ్రదుకుట

అవును కాదనిచెప్పఁవలవి కాకనుగదా
ద్రోణాదుల తనికిఁ దోడుపడుట
యెదిరించి పోట్లాడఁ నేపు లేకనుగదా
వసుధేశులందరుఁ వశ్యులగుట
యల్లుండ్లపై కూర్మిఁ నడగించుకొనికదా
శల్యుఁ డాతనితోడఁ సంధిగనుట
గీ. పెద్దపెద్దలె భృత్యులై పేర్మి దక్క-
యెప్పుడే మాయటంచు తాఁ మెచ్చుచుండ
నీతఁడట వారికివ్వఁ నీతిలేని
వానికెవ్వనికో నివ్వఁబూనెనంట. 13
మ. హరి సన్మిత్రము దయ్యెనేని మఱుకుఁ బ్లాయించు ఘోరాటవు
ల్దిరుగన్ జెల్లెలినింట నుంచుకొని యర్థిన్ స్త్రీము బోషించునే
కురురాజున్వడిగిట్టి తమ్ములు సుతుల్ గ్లోలెత్త రాజ్యంబుని
ర్భరవృత్తిన్దమవారికివ్వఁ కవ్రుఘాతపంతంబుతోనుండునే. 14

కావున యుగ్గిరిధరుండును యుగ్గిరిధర సోదరీవరుండును మహా పరాక్రమశాలురని యీవిక్రమ విహీనుం డురకనరచుచున్న వాడు. వారిశౌర్యంబులేనెఱుంగనే? ధైర్యసాహసాదిగుణంబులకు రాజరాజున కెనయయిన వారేడుజగంబులలో లేరు, ధర్మరాజునకు నింద్రుడియుముం డును. భీమునకు జనకుండు వాయుదేవుండును నర్జునునకు తాత పురందరుండును, నకుల సహదేవులకు తండ్రులశ్వనీ దేవతలును, నై యుండియుతనిజెనక లేక మిడుకుచున్నవారు వీరలందరిలో వీడెందు నబోలువాడో తెలియకున్నయది. వీనిరంకెలు నాకొకశంక యే? నిష్క- లంక చంద్రముఖియయిన నాసోదరీమణికి, దుశ్శాసన కుమారుండగు లక్ష్మణుండే భర్తయగునింక సందియంబెందును లేదువాడువచ్చిన ప్పుడెవ్వరేమిసేయుంగలవాడో చూచెద. (అనినరోషకషాయతామ్రయుగళుండై చలితోష్ఠద్వయుండై నర్మసచివున్ననుంగాని కోరమీసంబులు వడివేయుచు)

అ—నర్మసచివా! వినుచున్నవాడవుకదా.

సీ. ఏటేట నింద్రుని కెలమి చేసెడియాగ
మెవ్వఁడు తనకుఁ జేయించుకొనియె
జడివాన నడఁకునఁ దడియగొల్లలఁ బ్రోవ
నెవ్వఁడు పర్వతంబెత్తెఁ గోట
గోవత్సముల గోపకులఁ బ్రహ్మ దాఁచిన
నెవ్వఁడా రూపంబులెత్తి తిరిగె
నతి భీకరాటవినడరు కార్చిచ్చును
నెవ్వఁడు మ్రింగి మేలెనసియుండె
గీ. నిట్టికార్యంబు కుకురరాజులెవ్వరయిన
చేసియుండిరె యిప్పుడైనఁ జేయఁగలరె
యహహా మాతులపుత్రుఁడై యలరుకృష్ణ
మూర్తి యగుగాత మాచంద్రముఖికి భర్త. 15

అమ్మహాత్ముని చరిత్రమ్ములిమ్ముగాఁ బొగడ నలుమొగంబుల ప్రోడకైనం దరంబుగాదననే నెంత! యాగొల్లపిల్లల యుల్లంబులు పల్లవింపఁజేయుచు మల్లికాశరుని జక్కులదొరపిల్లని నుల్లసమాడు సోయగంబుగల యాయదువల్లభునకే నాచెల్లెలినిచ్చి పెంచ్చినకీర్తిఁ గాంచెద, యాసింహశౌర్యుండరుదెంచి నీలవేణిఁ బాణిగ్రహణంబొనర్చుతరి వారు, వారివారు యేమిసేయుదురో చూచెద.

(ఇవ్విధంబున నన్నదమ్ములిద్దరు రోషావేశ ముఖంబులతో కూర్చునియుందురు నారదుండు సంగీతముతో హరిస్మరణ సేయుచు ప్రవేశించును.)

7 రాగం హిందూస్థాని శ్రీరూపకం.

నా—రాధికామనోవిహార। రత్నహారరమ్యకేయూర॥ రా॥
పాదానతఖచరజాల। సాధులోలసత్యశీల॥ రా॥
నందగోపబాలనీల। కందనీలకనకచేల।
నందబృందా సంచారధీర భీకరారిగర్వదూర॥ రా॥

పుండరీకసదృశనేత్ర। భూరిశకటదైత్యజైత్ర।
ఖండనప్రదీపబాణ। ప్రస్ఫురన్మహితతూణ॥ రా॥
ధారుణీచారుశైలనగర। ధామపాదవినతసగర।
ధీరతాడేపల్లి లక్ష్మీ! నారసింహరాయ వరద॥ రా॥

విం—అ—సకలవిద్యావిశారద నమస్కరించుచున్నారము

నా——సంగ్రామవిజయమస్తు, సకలకార్యసిద్ధిరస్తు.

రా——మునీంద్రా యీమణిమయాసనంబునందధిష్ఠింపుడు.

నా—కం. చతురంగంబులునద్భుత
గతినుండునె రాజ్యపదవిఁ గడుభాగ్యంబే
సుతులును సతులును నిద్దరి
కతులితగతినున్నవారె యన్నిటమేలే. 16

విం——దేవా కర్మందిప్రవర! భవదనుగ్రహవిశేషంబున కొఱఁతలేమి యులేక నే కాలంబు గడచుచున్నయది, భవదాగమనంబెచటనుండియో యిక్కడికో యింకెక్కడికో తెలియకోఁగోరుచున్నవాఁడ. సెలవివ్వుఁడు, ఈదీనుండెఱింగి సంతోషించెడిని పరమభాగవతకులావతంస!

నా—చం. హరికడనుండి వచ్చితిఁ బ్రహామోదమొప్పగ నేడువీణాసహా
దరిపటు సుందరబు వినిఁ దైత్యవిరోధి ముదిభ్రమించిత
త్తరపడి మారుబారికెదఁ దాళగలేక నలంగిపంపెన
న్బరువడి యాంపె నోములుశుభంబుగ బండెగదయ్య యేమనన్
(అనినవిందుండతి చమత్కృతితో దమ్మునిఁజూపి)

విం——ఉ. ఇంతకుమందె నన్నునతిహీనమువల్కుల ధిక్కరించితా
నంతయు సేయబూని కరమందునకంకణ మూనియున్నవా
డంతటికాతడేయతనికెనాకసి చూడుడి యాతడెట్లనో
చింతమటన్న నందరము సేయుదమట్లనె మోదమొప్పగన్. 17
(అనిన దరహసిత వదనారవిందుండై యనువిందుని న్గనుంగొని)

నా—రాజకుమారా! అనువిందా?

కం. మెల్లగ హరిబంపిననీ
చెల్లెలికయి వచ్చినాఁడఁ జెలువొప్పఁగ నా
నల్లని సామికియిచ్చిన
చెల్లదె ముల్లోకములనుఁ జిరతరకీర్తుల్. 18

మీ యన్నమాటలు వింటివికదా! నీయభిప్రాయం బేమి (అనిన నతఁ డంజలీబద్ధహస్తద్వయుండై) చెప్పెదనాల్కొనుడు

కం. నెయ్యమున రాజరాజుతో
వియ్యం బందంగఁ గోరి విస్ఫుట గతితో
నొయ్యన జనియనివచ్చెమ
దయ్యెడి నా చెల్లెలికుఁ గోడలటంచున్. 19

ఆవృత్తాంతం బావంత యయిన నాతోఁ జెప్పక నువ్వుతిల్లుచున్న నేకారణంబుననో యాకాశవాణియాయన పేరెత్తి నీవా కురురాజుతోఁ గోరి చేసుకున్న చక్కచక్కపడునే, పల్లవాధరయగు నీచెల్లెలియుల్లంబు రంజిల్లఁజేయ నావల్లవమొల్లగంధుల మనోవల్లభుండగు కృష్ణుండు తప్పతక్క నరాజవల్లభుం డెవ్వడయిన సమర్థుండే యని యుచ్చారకుండై పిమ్మట యాసంగతెఱుంగఁ గోరిన కౌరవపక్షపాతుండై కమలేక్షణ నాలక్షణుని కివ్వనిశ్చయించి యున్న నాచిత్తంబా మత్తచిత్తులయందు హత్తకగుణోత్తరుండయిన హరికియివ్వఁబూనియున్న, ధిక్కరించి తానొక్కఁడుండే యుక్కరాతుల కిచ్చెదనని రాయి నుద్దుచున్న వాఁడు నేనంతకంటె గంతులు వేయుచు రుక్మిణీకాంతునికే జవ్వని నివ్వఁబూనియుంటి నింతలోఁ జుక్క తెగిపడ్డట్లు మీ రిక్కడి కరుదెంచితిరి కమీయిష్టానుసారంబుగ స్పష్టపరుచుఁడు. (అనిన దరహాసితవదనారవిందుఁడై తనకరద్వయంబుచే వారిదువురి చేతులూని యొక్క గద్దియపై గూర్చుండ నియమించి తాను వారిసన్నిధి నుచితాసనంబుననుండి మందమధురాలాపంబులతో.)

నా—సీ. ఒకమాట రజమునఁ బూని ప్రపంచభువనని
ర్మాతయై ధాతయై మలయు నెవ్వఁ
డొకసారి సత్త్వంబుఁ బూని లోకావన
ధృష్ణుఁడై విష్ణుఁడై పాలుచు నెవ్వఁ
డొకతేప తమమాత్మఁ బెఱయ జగత్రయో
న్మూలియై శూలియై మురయు నెవ్వఁ
డొకపరి ప్రళయపయోనిధిలోఁ దమ్మి
కంటియై యొంటియై కడఁగు నెవ్వఁ
గీ. డతనికంటెను జగములేఁ గానె జగము
కంటి నాతఁడు వేఱెనఁ గంటె వింటె
తొంటిరాజులు హరికృపఁ యుంటిగాదె
పుట్టుచావులు లేనట్టి పట్టునుంట. 20

అమ్మహాత్ముండు దుష్టజనశిక్షయు శిష్టజన రక్షయు చేయుట కై కదా యనేకావతారంబు లెత్తి యిప్పుడో దేవకీవసుదేవుల యశోదానందుల పూతచరిత్రుల జేయఁబుట్టి రుక్మిణ్యాదిజగదేకసుందరీమణుల పెండ్లియాడి స్వబలవిశేషంబున సముద్రంబులో పట్టణంబు గట్టుకొని మహాప్రతాపశాలియై వెలుంగుచున్న కృష్ణుని వర్ణింప నెవ్వ రోపుదురైన నానేర్చుకొలంది కొంత చెప్పెద సావధానచిత్తులై వినుండు.

సీ. మాంసలదర్పదకంసధరాధిప
కృంత కిరాతకమూర్తిఁ కృష్ణమూర్తి
యక్షీణ కరుణాకటాక్షవీక్షణవిని
ర్జితభక్త జనతార్తి కృష్ణమూర్తి
యుద్ధవాక్రూరాదిసద్ధర్మయుతజన
హృదయకమలవర్తి కృష్ణమూర్తి
పూతనస్తనవిషవ్రాతపానాతిత
పృథుబలయుతకీర్తి కృష్ణమూర్తి

గీ. సకల సంపన్నికేతనశక్రముఖర
ఋభుపరివృతైల వరవర్తిఁ గృష్ణమూర్తి
అసమ విశిఖప్రయోగమహాత్మ్యతివిజయ
కీరవాహన నిభమూర్తిఁ గృష్ణమూర్తిఁ. 21

ఉ. ఆమహనీయ మూర్తికిఁ సమంచితకీర్తికి నిర్జితార్తికి
న్హేమసుశాటికి న్భూషితనిర్జరకోటికి శౌర్యపేటికి
న్నామితదాయికి న్పృథజనస్తుతిపాయికి శేషశాయికి
న్స్త్రీమహిళానుకూలికి విరమర్దితమాలికి భక్తపాలికిన్. 22

ఉ. చక్కనివారి కందఱికిఁ జక్కనివాఁడు యదుప్రభుండుమీ
చక్కనిబొమ్మ యున్నగులఁ జక్కనిదందఱికంటె జూడగా
చక్కనివారినిద్దఱినిఁ జక్కఁగఁగూర్చిన నన్నికార్యము
ల్చక్కనకావె కోర్కెకొనసాగదె యేరికి నైనజూడగన్. 23

విందథరాధవ చంద్రగోవిందుండు మీమామనందనుండేకదా యీ కందర్పసుందరున కమందానందంబున మీచెల్లెలి నిచ్చి యీ బల్లిదుని యిచ్ఛదీర్పుము. నేను వచ్చినదందుకే యీగోపాలుండు డాపరాని మరులెక్కియున్నవాఁడు. పందియుంబేల (అనిన నిచ్చుటకిచ్ఛలేక నివ్వననుటకు వీలులేక కొంతసేపూరకుండి) మునీంద్రా యొక్కమనవి చేసుకొనుచున్నవాఁడ సమగ్రానుగ్రహంబున మన్నించవలయు.

విం—క. హరిబావమాఱునాతని
కరుణాపాత్రులముమేముఁ గాదనగలమే
కురురాజు తోడబల్కిన
సరసంబులు విరసములయిఁ జరగవెకలతల్. 24

ఆతని పాలనంబులోనున్న మేమునాతినివ్వక బొంకి యింకెక్కడనుండగల మాతండుదండిమగలతో దండువెడలి నప్పుడే పుండరీకాక్షుండే యాఖండలపుత్రుం డడ్డపడి జడ్డిగంబులు కాపాడెదరో తోచదు. వాచంయమివర్య! మీబోటి పెద్దవారలప్పుడు కాన్పింతురేగాన పరులమాటలునమ్మి సిరులు పోగొట్టుకొనువారెవ్వరైన నివ్వసుధా

వలయుంబున నగలరే విూరేచెప్పుడు. ఇందుకొరకై సందియించు చున్నవాడ.

(అనిన నతని చేతోవృత్తికి చిత్తంబున గర్వించుచు కానీచూతము. వీనికి దగినయుక్తి చెప్పెదనని)

నా—వింద భూపతివర్యవినుము.

క. మీయిద్దరిడెందంబుల
నీయెడ ఖేదంబులుండకేనెట్లనుమీమీ
స్థాయుత్ప్రతినలు దప్పక
సేయుడు నేనొక్కయుక్తి చెప్పెదవేడ్కన్. 25

ఒక్కశుభముహూర్తంబు నిర్ణయించి స్వయంవరంబనిసమస్త దేశాధీశులకు నెలిపిన నందఱరుదెంతురు. నాటిరోజా చంద్రవదన నెవ్వారి వరియించితే వారే భర్తయగును. అన్నిట నృలవంతుడైన వారినే కోరుకొనుగాని యాలుహీలులేనిబేలనేల యాబాల మెచ్చునీప్రకారంబా స్వయంవరంబు నెరవేరిన నెవ్వారికేమి కోపంబులు రావుగాన నామాటకు సమ్మతింపుడు. (అనిన వారిద్దరు సంతోషించుచు నేకకంఠులై చేతులుజోడించి.)

క. బాగాయెమీవచస్సిద్ధి
రాగాది గుణప్రభంగకరమ్యద్గతిమీ
యాగమను మాకుసౌఖ్యో
ద్యోగంబై దోచెదివ్యకె యోగానందా. 26

నా—రాజకుమారులారా మీసోదరీ రత్నంబగు మిత్రవిందతో మాట్లాడిపోయివచ్చెద దయయుంచుడు.

(అందరునిష్క్రమింతురు)

(రంగము విచిత్రసౌధము దోమతెర మంచముమీద నిద్రపోవుచునుండవలయును నిద్రలో)

మి—చ. ననువిడనాడి పోవఁదగునా యిఁక నావగ నాదుమక్కువ౯
కనికరముంచవింత వెటుకాకటుకావిట కాదటుట్లునే
మనఁగలదాననయ్యొ హాటకమావిట మాయటుమాయకాడక్ర
న్నననిను బాసి నిల్వఁగలనా తలనాకలనైన జూడఁగ౯. 27

(అనువాక్యంబులు చెలికత్తెలువిని యులిక్కిపడి హాశ్చర్యమగ్నమానసలై చేరంజని పిలిచినపలుకకున్నఁగట్టిగ).

తల్లీ తరుణీమతల్లి ఏమిదో పలుకుచున్నదానవు లెమ్మా.

(అనునంతలో)

మి—క. ఏరాపోయెదవిదితగ
వేరాబిగి కౌఁగిలివ్వఁబేరాచారా
లారా నమ్మినదానిని
రారాపులు సేయుమెరకరాయుతహారా. 28

ఛీఛీ చేడియలారా పోవుచున్న జూచెదరా నామేలుమీఁకు మేలుగానట్టు తోచుచున్నయది మీకును పొండు (అనుమాటలకాబోటులు నీటులు చెడికొంతసేపు యోచించి యుందులో కీరవాణి యిదికలకాబోలునని సమీపించి పన్నీరుచే కన్నులుతుడిచిన దిగ్గునలేచి దిక్కులుచూచి సిగ్గుపడి తలవంచుకొని యున్న రాజపుత్రినుంచి తక్కినవారినందరి నవతలికిదోచి)

8 భైరవి ఏకతాళం,

ఇదియేమిచిత్రమూ॥ ఇది॥ మదపతియే మోమాట్లాడెద॥ ఇది॥
పరిణయమెనయని వడుచుపయయొ పరపురుషునిబిలిచిన వడుసబలికె॥ ఇది॥
ఇటునటు చెదరని దిటమగు మదిగల కుటిలచిదురలివ్వటి సనితగ॥ ఇది॥
సాటిబోటులీమాటవిన్న నగుబాటుసేతురెచ్చోటనైన॥ శివలలితాడేపల్లి లక్ష్మీనృసింహోజ్వల నుతచొల్లేట్పతి హారిగల॥

చ. మొగమొకరీతితోఁ జెమటఁ మోవివిలాసము తగ్గి చన్నుల
న్దగిలిన పుష్పమాలికలుఁ దారములూడక రాలెపక్కపై
బాగసుగ జెక్కుటద్దములుఁ జూపడె వింతలుగొన్ని తెల్లవా
ఱ్ఱగనగునమ్మ నేను విననాఁ గాతగుదానను గాన నెచ్చెలీ. 29

నన్ను బెదరించదలంచి యిన్ని చిత్రంబులీవె కల్పించుకొని నట్లు తోచుచున్నయది లేనిచో శుద్ధాంత సౌధాగ్రంబుపైనున్న నీకెట్లుపాసగుగాన నున్నదున్నట్లు చెప్పవే యొప్పులకుప్పా.

(అనిన తనమనంబున నుబ్బట్లాడిన సిగ్గుగగ్గోలుసేయ తనలో తాను) అహా! కలలోఁగలిగిన రతిసౌఖ్యంబు లేమని సెప్పుదు. చెప్పిన నీకప్పూరగంధి తప్పుగానెంచి వెలిపించునేమొ ఛీ! ఛి! ఇట్టిరహస్యంబు లెంతప్రాణస్నేహితులకైన తెలుపతగదు. (అని కొంతసేపూరకుండి) యెంత వెఱ్ఱిదాననైతిని. నాపంచప్రాణంబులలో నొక్క ప్రాణంబుగానుండి నాకుమేలుసేయుగోరి యొక్కనిముషంబైన బాయని యీనెచ్చెలి కంటెమెచ్చికగల వారెవ్వరు. చెప్పెద. చెప్పి యీయొప్పులాడినిలోబఱచుకొని మదీయమానధనంబు హరించిన నాచోరుని నేతీరునైన బావించుకొని మోహంబపనయించుకొనుచుండెదనొక్కరైనన్నట్లు దెల్యని జిట్లులేనట్టయితే కార్యంబుచెడి చిట్టచివరకు రట్టుపడి గట్టుకొనవలసివచ్చు (అనియోచించి) సఖీకీరవాణీరమ్మా.

చ. ఒకకలగంటినమ్మ వికచోత్పలలోచని యొక్కసుందరుం
డకటుపరీతివచ్చి బిగియారగ కౌగిలి గ్రుచ్చి మోవిపా
నకమును ద్రావి యద్దములనందగు చెక్కులు ముద్దువెట్టి సా
రెకు జనుదోయి ముట్టుచు మఱిన్మరుకేళి నలర్చిపోయెనే. 30

ఉ. నవ్వుమొగంబు వాడు మది నమ్మకము ల్పరించువాడు మే
ల్జవ్వనమొప్పు వాడు కను సన్నలకూరిమి నించువాడు బ
్రలవ్వులసొమ్ము వాడు కను లందెలితమ్ముల నేలు వాడునూ
పువ్వును ధిక్కరించు నును ముక్కొఁగిగల్గిన వాడు సుందరీ. 31

ఉ. నల్లనివాఁడు చారు వదనంబున సన్ననిబొట్టు వాఁడువి
ద్యుల్లతబోలు చేలమెద నొప్పినవాఁడు కృపారసంబుపై
జల్లెడువాఁడు వక్షమున జానగుమాలికవాఁడు చల్లనౌ
మెల్లనిమాటల న్మనము మెచ్చగఁ జేసెడు వాఁడు సుందరీ. 32

ఉ. మారుఁడు కాఁడు శక్రుని కుమారుఁడు గాఁడు తలంప రోహిణీ
జారుఁడు కాఁడు కిన్నరవిచారుఁడు గాఁడు కుమారి వారల
న్వారక మెచ్చ నట్టిపయి వారలనైన నిరాకరించు హా
వారిజనాభు వంటిమగ వారలు గల్గుదురమ్మ భూస్థలిన్. 33

క. మదనుని కదనమ్మునకు
న్మదనం బొగిఁజూపిచని యొకమగువా వినునీ
యెదనొచ్చుఁ వచ్చెదనని
యెదయమది న్మఱచెనో రకీహాన్వచ్చు నికో. 34

(అని ఆత్మగతంబున) నేనెంత వెఱ్ఱిదాననైతినక్కటా! పట్టి చూచినమగవాఁడును, పెట్టితీసినసొమ్మును మునుపటట్లు ప్రకాశించవనుమాటలు, బూటకంబులౌనా యెక్కడికల, యెక్కడిగోడు యీ పుట్టువున నికనట్టివానిని చేపట్టుదునా! యన్నలంతవానికి నన్నిత్తురా! (అని చెలికత్తియఁజూచి) కీరవాణీ! నేనా సుందరుని గట్టిగా పట్టుకొని యుండవలసియుంటి. అందఱికి న్వరచి మానుకుంటి, అక్కా నీవెక్కరణినైనన్వాని సుందరకులశీల వయోలావణ్యంబులెల్ల, నాయన్నలకుఁజెప్పి నన్ను వానికేయిప్పించి నాచే మెప్పొందవుకదా, నీకష్టంబునకు ప్రతిఫలంబొసగనా. యేది యోచించుము. (అనిన కీరవాణి తనలోఁ దాను నవ్వుకొనుచు, ఇది గోవిందునిమాయగాని మఱొక్కటికాదని యారాజకుమారి న్బుజ్జగించుచు)

కీర — కుంతల కాంత్యపహసిత షట్పదబృందా మిత్రవిందా.

చం. మదినిక జాలిజెందకుకుమారికలన్గనుపించువాడనీ
సదనమునందునుండునెవిచారమొకింతయులేకబల్కెడో
మదవతితత్ప్రయత్నమికమానక చేసిభవత్కటాక్షసం
పదజరియింతునీకికశుభంబగుసందియమేల కామినీ. ౩౫

తల్లీయూరడిల్లుము. ఇకయీపనిదప్పయొండుపనినాకేల.

(అని అందరునిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.





శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

---

## తృతీయాంకము

(రంగము-బంగారుమేడ. సఖీపరివృతయగు రాజకన్యక కడకు నారదుండు ప్రవేసించుచు)

నాదనామక్రియ — ఏకతాళం.



రాయణకేశవా।
గోవింద శ్రీరుక్మిణీలోలధారాధరనీల॥ నా॥
కోరినవారికికోరికలివ్వగ।
యేరీనీవంటివారేరేడుజగముల॥ నా॥
బృందారకులెల్లవృందనికీర్తించె।
స్నంచెగదయ్యాయానందునివల్ల॥ నా॥
వక్రయాత్రయమునపరలెడుకుబ్జని।
ర్వక్రగచేసినవక్త్రజితాబ్జ॥ నా॥
వరతాడేపల్లిలక్ష్మీనృసింహాహ్వరాయేడ్య
ధరణిశ్రీచోళ్లేకపురిజానకీశ్వర॥ నా॥

(చెలికత్తెయొక్కతెవచ్చి) ఏలికసానీ! యదుగోగీతంబుపాడుచు భవన్నికటంబునకు నారదుండరుదెంచుచున్నవాడు. (అనిన దరహాసితవదనారవిందయై సఖులతో నెదురేగితోడ్కొనివచ్చి కనకమయాసనంబున న్గూర్చుండబెట్టి, మౌనీంద్రా! వందనశతంబొసర్చుచున్నదాన. (అనిపాదంబులపయినబడి కాచినిలుచున్న యాకుంద రదనన్జక్కగాజూచి.)

నార — శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు మనోవాంఛాఫల సిద్ధిరస్తు.

శా. రాకాచంద్రునిబోలు మోముతెలుపై రంజిల్లు కందమ్ములు
న్శ్రీకారంబులనేలు కర్ణయుగము న్జెల్వొందు కన్బొమ్ములు
న్నాకాల్మిదికిజారు కేలుగవయు న్బొల్పారు కృష్ణుండిక
న్నీకాంతుండగు నిక్కమీపలుకు నిర్ణిద్రస్థితి న్గామినీ. 1

శా. నీతారుణ్యము నీయొయారమును నీనీటు న్వినంబొల్పునీ
సేతళ్కునును మోవి నీసడుము నీచిత్తంబును న్నీనడల్
శీతాంశున్భ్రమియించు నీమొగము వాసిన్నెమ్మదిన్మెచ్చగా
నాతోజెప్పెను నిన్ననందు కెకదా నారాకడల్మానినీ. 2

రాజపుత్రీ! నీపూర్వపుణ్యఫలం బేమనిచెప్ప శంకరపంకజాసన ప్రభృతి సమస్తదేవతా కోటీరకోటి సంఘటిత మహామణిప్రభా ప్రభాసిత పాదపంకజుండగు వాసుదేవుం డపరిమితానంద కందళిత హృదయ పంకజుండై నీచక్కదనంబునకు మెచ్చి పరిగ్రహించదలంచి నాతోచెప్పిన నేనరుదెంచి నీయన్నలతో సంభాషించి దుశ్శాసన పుత్రున కివ్వవలయునని నీపెద్దన్నయు, కృష్ణునకే యివ్వవలయునని నీచిన్నన్నయు కొట్లాడ వారిపోట్లాటమాన్పి యేకకంఠులజేసి స్వయంవరంబున నీయిష్టమైనవారి వరియించునట్లు కట్టుదిట్టంబు లేర్పర్చి నిన్నుజూచి పోగలందులకై వచ్చితిని. నిన్ను మెచ్చితిని. మచ్చెకంటి! (అనిన పులకాంకురిత సర్వశరీరిణియై పునఃపునః ప్రణామంబులొనర్చి తేనెలొలుకు పలుకులతో)

మి-చ. మింటికిదాకుపెన్తపము మేయగతిన్గడచేసి వేడిన
న్గంటికిగానుపించనియఖండలమూర్తి వినీకునీపైనా
యింటికివచ్చికృష్ణుడు మదీశ్వరుడౌనని పల్కవింటినా
తొంటిభవంబునన్గలుగు ఘోరపునోములపంటదెట్టిదో. 3

(అనియాత్మగతంబున) ఏమి నాపూర్వపుణ్యంబు. ఈ మహానుభావుం డరుదెంచి జగన్మోహనుండై వెలుంగు వాసుదేవుండు నిన్ను వరించునని చెప్పె. ఈవాక్యంబు లెంతనమ్మకంబులో చెప్ప

జాల (నని కొంతవడి యూరకుండి) నాకంతకంతకు తెలివికలుగు చున్నదే! కేవల బ్రహ్మమానస పుత్రుండగు యీతపసినుడువు నుడువు లొక్కటియైనం దప్పిపోవునా, పోవు. దీని నిజానిజంబులు మదీయస్వప్నంబే స్పష్టపరుచుచున్నది. (అని ద్రాక్షారస సదృశంబు లగువాక్యంబులతో)

చం. ఇవినిజమైన పల్కులె మునీశ్వర! రుక్మిణి సత్యభామజాం
బవతిదినేశ పుత్రివర భద్రసులక్షణ నాగవిస్ఫుర
త్కువలయ నేత్రలుండ ననుగోరునె కోరిన వారికోపము
ల్దవులకనుండరే మదిముదంబొదవ న్గరుణించి మ్రొక్కెదన్. 4

(అని, మొగంబున చిరునవ్వొలయ)

శుద్ధకాంభోజి — ఆదితాళము.

నా—ఏలబాల బేలవైతివిక-నామాటలునమ్మక॥
ఆలోకసుందరునికాంత-లోలలోచనులుత్రిప్ప।
జాలరువెయ్యేలనుగోప-బాలుడునీపాలవునిజముగనేల॥
మి— నెమ్మనమ్ము నమ్మదిప్పటికి-మీరెన్నిచెప్పిన॥ నె॥
తమ్మిగద్దియ కొమ్మయె-రుక్మిణమ్మనుచు వింటినిహారియా।
యమ్మకువశుడుకాకనారూ-పమ్మునకుభ్రమజెందునెచూడగ॥
నా—క్రొత్తక్రొత్తబిత్తరివినీవు-కనులారజూచినక్రొత్త।
యత్తెరవల కంటెయుంద-కత్తెవంతియు కాకనుమే।
నత్తకూతురవునీపై-హత్తునుహరికిచిత్తమెప్పుడు॥ యేల॥
మి—నిన్నమొన్నయున్న వాడుకదా-యాలేమ లందరు॥ ని॥
వన్నెగనెక్కైను క్రొత్త-యున్నవనుపోయి వారల।
మన్ననలు తెల్యకసిగ్గున-నున్న నేరములెన్నక నుందురే॥ నె॥
నా—వారిజేరి కేరుచుండెదవు-సిగ్గెన్నినాళ్ళు॥ వారి॥
కోరినకోరికెలు-శౌరిచేరి దీర్చుచుండగ గడి।
శేరినారిమే మెపుడైన-గోరివచ్చినమాట్లాడవకో॥ యేల॥

మి—యేరికోరి భూరితేజమున-చొల్లేరుపురమున॥ నేరి॥
జేరి తాడేపల్లిలక్ష్మీ-నారసింహరాయునకు,
కోరినకోరికలిచ్చు-సారసలోచనునిమామ॥ నెమ్మ॥

కం. ఇమ్ముగ మొక మంత్రరాజము
సమ్మతితో శౌరినాకు స్వాధీనుండై
యెమ్మెలుగుల్కఁగ ప్రతిదివ
సమ్ముగ నాయింటనుండు సద్గుణకాండా. 5

నార—(అని నవ్వుకొనుచు తనలోతాను) ఈచిన్నదా వన్నెకాని మొగమున్నచోటైన నెఱుంగదే! యిప్పుడేయింత మరులెక్కియున్నదన్ని కార్యంబు లారి తేరినచో నక్కమలాక్షుని బలంబొక్కసారి గుటుక్కన మ్రింగునేమో యబ్బబ్బా! యీబిబ్బోకవతి దెబ్బ (అని తల యూచుచు)

మ. తరుణీదక్షిణనాయకుం డతడు కాంతలోట్టి మందైనబం
ధురపంచాస్త్రకళా రహస్యములలోకత్తోరంబుగానందరి
న్నర మొప్పారగ నేలుచు న్సమతరంగత్కేళి దేలున్సుమీ
కరిభాస్వద్గతనీదుకోర్కెఁ బిదపన్నావింతు సైరించుమా. 6

బాలికామణీ! నీవింక సంతోషమున నుండుము. నీకోరికె తీరెడు కాలంబాసన్నంబగుచున్న యది నేను పోయివచ్చెద దయయుంచుము.

(అని అందరు నిష్క్రమింతురు)

(రంగము. దర్పణసౌధంబు-కీరవాణి ప్రభృతి చెలికత్తెలు గొల్వ మిత్రవింద కూర్చునియుండును)

మి— కీరవాణి! నాదగ్గర జేరికూర్చుండవెందుకు?

కీ—వలికసానీ నాకంతకంటె నేమిపని యున్నది. వచ్చియుంటిని.

మి—(కీరవాణిఁజూచి)

ఉ. ఎప్పుడు నా స్వయంవరము కేర్పడు భూపతులందరుండనే
నెప్పుడు నామనోహరుని కేయింపాగిచూచెద కన్నులారగా

నెప్పుడుశౌరికంఠమునఁ హేమమయంబగుదండవేతునా
కెప్పుడుచక్రిభర్తయనిఁ యెల్లరుబల్కుదు రింపుమీఱగన్॥

(అనినకీరవాణిదిగ్గునలేచి.)

కీ—తల్లీభవదుల్లంబురంజిల్ల మునితల్లజుండంతయు కరతలామలకంబుగా చెప్పిచనియెకదా. ఇంతలో తొందరెందుకు. ఎల్లవాలోచింతము. (అనునెడ చతురంగబలయుక్తుండై కందర్పుండుదవ్వుదవ్వులదోఁచిన బెదరి చెలికత్తెలన్గాంచి బిగ్గరగా)

మి—ఉ. మారుడుసారసాలయుడఁ మారుడుశంబరదైత్యనాథసం
హారుడుమోహకాననవిఁహారుడుపుష్పశరప్రసారణా
చారుడుదుష్ప్రయుత్నపరిఁచారుడుయావతమానసాంతకా
కారుడుఘోరవర్గుణవిఁకారుడువచ్చెనుచూడవేచెలీ. ౮.

చ. చిలుకగుఱంబునెక్కికటి◆ చెక్కినకేతకిబాకుతళ్తళ
ల్వోలయపరాకుచెల్పుచును◆ వెంటపికంబులుగొల్వగోరువం
కలుభటులై చెలంగసుమ◆ కార్ముకమెక్కిడిపూవుటంపర
న్గలికిఁచప్రదేశమొగి◆గాడగనేసెనికేమిసేతునే. ౯.

(అనికొంతసేపూరకుండి.)

ఇంతీయీకంతునికొంతసేపుకొనియాడిచూచెద. (అని)

సీ. కమలబాణుండవై◆కమలపాణులనేచ
నాయమాయిదినీకు◆కాయజన్మ
శుకతురంగుండవై◆శుకవాహులగలంచ
మోదమాయిదినీకు◆మాధవసుత
రతినాయకుండవై◆రతికాముకులనొంచ
బింకమాయిదినీకు◆పీనవక్ష
సుమకార్ముకుండవై◆సుమకోమలులముంచ
తేజమాయిదినీకు◆భూజననుత

గీ. శబ్దసంబంధబాంధవ్య◆సరణిచూడ
భేదమింతైనఁగనుపించ◆లేదుమనకు

యెందుకోచలమిటుచూపు • దెలుఁగరాదు
ధీరితరవిక్రమధురీణ • పుష్పబాణ. 10

(అనియనేకవిధంబుల బ్రార్థించిన నంతకంతకు వెఱపించుచు పంచవిధశరంబు లొడలనించుచున్న కీరవాణిం జేరంజని దైన్యరసంబుతో)

హిందుస్థాని—జాఁప్వతాళము.

ఇకెంతసేపునేభరింతునే సఖీమణీ।
యకారణంబుగానలంచె వయొసఖీమణీ॥ ఇకెం॥
సుమాస్త్రువాళిమేనునిండె చూడవేచెలి।
యమానుషంబుసేయఁబూనె నమ్మయోచెలి॥ ఇకెం॥
సుమంతయైనధైర్య మెదనుసోకదేచెలి।
సుమంబువంటిమేనుకాక స్రుక్కెనేచెలి॥ ఇకెం॥
ధరనొప్పుశ్రీచోళ్లేరునగర ధాముఁడైకృప।
వరలక్ష్మినారసింహరాయ వరదుఁడేలఁడే॥ ఇకెం॥

(ఇట్లుబల్కి తనలో) వెఱ్ఱికివేయివిధంబులని పెద్దలనెడిమాటలబద్ధమా యీకొంచెపువానిని మంచిమాటలతో వేఁడిన మేలు సేయునా సేయఁడుగాన వీనిమానంబుమాలి నేలపాలగునట్లు గట్టి తిట్టులు తిట్టి యుమట్టువెట్టెద కానిమ్ము. (అని రోషావేశ ముఖారవిందయై)

మ-శా. నీకోదండము వాడఁ నీదుశరము • ల్నీరంబులోఁగూడనీ
బాకాచెట్లను జిక్కనారివెతలై • పద్దంబులందక్కనీ
మూకలొక్కండలనుండ నీరదముపా • ముల్కోటిలో నిండనీ
పోకాశంభుఁడుచూడనేనుమదిలో • సుంతైననిన్వేడరా.

ఉ. నీకును నీదుమామబలె నీతియొకింతయునైనలేక పె 11
న్వ్యాకులపెట్టుచుండెద వకారణవైరముచే వియోగుల
స్త్రీకొనలేవు యోగులకుకొడిందిమగంటిమిగల్గువాడవే
ఛీ! కమలాస్త్ర శంకరునిఁ జేడెనసన్మది సిగ్గులేదుగా. 12

(అని సరోరుహాస్త్రుని తిరస్కరించి తదీయ చతురంగంబుల జూచి కోపముతో)

సీ. కీరమా నీకింత • బీరమా హాహాంత
నరువసాంకవగంధి • నాటవిసవు
వాతమా సంజాత • శీతమా ఇదిరోత
యనవు నేఁ ఫణివేణి • ననుచు కనవు
పైకమా నీవింక • ఢాకమా నవుజింక
మిడనీలవాలనా • మెసగ వేమొ
భసలమా నీవిట్లు • మెసలమార్గమ దెట్లు
హేమనాసనటంచు • నెంచిమనవు.
గీ. యెదిరిబలముల నెరుగక • యెవ్వరేని
కదసిపోట్లాడ పరిభవం • బొందవకున్నె
యందు కేకద మీదార • హరుని దాకి
భస్మమైపూలదేమున్న • పంతమేది. 15

(అని శుకపికముల యసమీర బంభరంబుల నదలించి చెలికత్తెలజూచి) సఖీమణులారా! యెన్ని జెట్టినా అన్నియు న్మరచి కుసుమాస్త్రుం డసమాన విక్రమంబున పువ్వుటంపరచే నొడలెల్ల, చుఱుకు, చుఱుక్కుమనుపించె. కలకలమని చిలుక లులికిపడ బలికె నాతతభీతినసువాసితంబులు చీకాకుపడ కోకిలమూకలు కోహోయనికూసె. ఇమ్ముగా తలదిమ్మ గ్రమ్మ తమ్మితేనియ లిమ్ముగాగ్రోలి తుమ్మెదమొత్తములుఝుమ్మురుఝుమ్మన గానమ్ములు చేసె. మేనువడంకె. నేనింకసైపజాల (నని నెమ్మేనుమఱచి మూర్ఛిల్లిన చెలికత్తెలు వెల్లనైనమోములతో) తల్లి! మాయుల్లంబులెల్ల ఝల్లుఝల్లన మమ్మిక్కడడించి నీవెక్కడైె వెక్కడికిపోవుచున్నదాన వికజవ్వని మాకెవ్వరుదిక్కు (అనునెడ కీరవాణి ధాతుస్థానంబుల పరిశీలంబుచూచి)

కీ—మదనమాలా.

మ—ఏమమ్మ కీరవాణీ.

కీ—ఇదిగో దీని చేయి చూడుము.

మ—చూచితిని.

కీ—క. ఇదిమూర్ఛగాని వేరొక
విధమేమియు లేదు చూడ • విధుబింబముఖీ,

మ—క. అదియే నేననుకొంటిని
సుదతీయేమిడినకనుల • చూచునెమనలన్. 14

కీ—సుందరీ తొందరించిన కార్యంబవ్వునా నేనందుకే కదా యోచిం
చుటలు.

మ—అక్కా నీవన్నియు దెలిసినదానవు, నీవే చక్కనపోయెదవ్రా
నాకు నా చక్కియేముఖ్యము.

సీ. పడతిరో చల్లని • పన్నీరు చిల్కనా?

కీ—యదికను దమ్ముల • కంటవలదు.

మ—కమలాక్షిరో చంద్ర • ఖండంబు రాతునా?

కీ—స్తనచక్రములకడ • దలచవలదు.

మ—కలికిరో చిగురుటా • కుల గుత్తులిడుదునా?

కీ—తనుభర్త్రమునకవి • తగులవలదు.

మ—చెలదిరో నేమంచి • వీవనవేతునా?

కీ—పాణిపృష్టముకడ • పట్టవలదు.

మ—గీ. చారుతరశైత్యచందన • చాదికోరి
తెచ్చితిని చల్లవచ్చున • మచ్చకంటి

కీ—మదనతాపంబు చేగ్రాగి • హృదయకలశ
పూరితస్నేహరసమది • పారలవలదు. 15

(అనెడు పలుకులకు మదనమాల మదికుదరక)

మ—కం. ఏపని సేయగబోయిన
నాపని వలదందు వెప్పు • డదియేమిటికో.

కీ—కం. ఓపడతికోపమటవే
యాపనులాస్థానములను • నహజములటవే. 16

మ—అక్కా కీరవాణీ! ఈచక్కెరబొమ్మ వాల్చినపక్క కదల్చకున్నది. కాలాతీతంబైన నేమి హాని సంక్రమించునో గాన తొందరగా శైత్యోపచారంబు లొనర్పుటయే మంచిది. (అని కీరవాణిఁజూచి)

సీ. ఇంతియీచిగురాకు◆ లేమిసేయుదమమ్మ?
కీ—తీవిపాదములకం◆టించవమ్మ.
మ—అరటులపొరలున్న◆వవియేమిపనికమ్మ?
కీ—పొలతియూరువులకు◆ పొదువవమ్మ.
మ—తోరమామలరుగు◆త్తులనెందుకోనమ్మ?
కీ—చెలిగుబ్బచనులపై◆ చేర్చుమమ్మ.
మ—కలువరేకులు చాల◆ చెలులుదెచ్చిరిసుమ్మ?
కీ—కలికికన్నులమీఁద◆ కప్పవమ్మ.
మ—గీ. మొలకపాల మిదెందుకో◆ తెలియదమ్మ?
కీ—ముగుదకుంతలములనుండి◆ ముడువవమ్మ.
మ—చెలఁగికొండమ్మ లేపని◆ సేయునమ్మ?
కీ—నాతిచేదోయికిని గీలుకొల్పవమ్మ. 17

మదనమాలా! చూచితివా యీవస్తువులీస్థలంబుల కనుకూలంబులై శైత్యోపచారంబులచే నొక్క యరక్షణంబునకు తెలివి నొంది ప్రకాశింపఁగలదు. చూచుచుండుఁడీ. (అనునంతలో ముసుంగిడిన పట్టుశాలువ సడల్చి దిగ్గునలేచి, కీరవాణీ మదనమాలలంజూచి)

మి—తోఁబుట్టువులారా! మీ మోముదమ్మ లెందుకో చిన్నబోయియున్నవి చెప్పుఁడు. (అనినవారలు చెక్కిళ్ళు దువ్వుకొని చెక్కులు ముద్దుపెట్టుకొని గంభీరభాషణంబులతో)

తే—గీ. ఏమిచెప్పుదుమమ్మ నీ◆విపుడుమూర్ఛ
జెందినందున భయమందె◆ చేయువిధము
లెల్ల చేసిన తెలివొందె◆ నిపుడు మధుర
మృదులవాగ్భృందధృతకుంద◆ మిత్రవింద. 18

(అనిన విచ్చియు రాని నవ్వునవ్వి ప్రునర్మోహావేశం బగుటయు
చెలికత్తెలం గనుంగొని)

తోడిరాగము—ఆదితాళము.

మి—రాడేమాయలకాడే-యీడుజోడని నమ్మియుంటిని
నన్ను వీడనివాడనుకొంటిని । యేడే వాడయొ రాచపాడి మాని
యెందు॥ రాడే॥
ఘనుడాతడవి వలకోటగా। యల్ల! మునిమాటలవినీళ్ళమూటగా।
మది। ననుకన్న ముచ్చటలవి దూరమైపోయె॥ రాడే॥
మాపుడెక్కు-వశత్రుపుడాయెను । కంటికిరీతికూర్కు-లేదాయెను
కీరవాణియింక యేరీతిభరియింతు రా॥
వరకీర్తిజితహీరకాశుడై చొల్లె । ప్పరిదివ్యసౌధనివేశుడై
ధరతాడేపలిలక్ష్మీనరసింహారాయేడ్వాడు రా॥

(ఇవ్విధంబున నలంగుచున్న యామంగళాంగింగని తేనెలొలు
కుపలుకులతో.)

చె—కం. కొమ్మా మానవినిగై
కొమ్మానీవింత మరులుకొనతగదమ్మా
రమ్మావనరాజివినిక
రమ్మారయసుగుణసదనరాజితవదనా. 19

చం. అచటికిపోయిచూడదగినట్టివినన్నియుజూపనచ్చట
న్విచికలపుష్పసంపదలవేడుకలెల్లనుగన్న నెమ్మది
న్మచిగనుపించుపిమ్మటసరోరుహాలోచనయిల్లుజేరిన
న్బ్రచురతనన్ని కార్యములభంగురరీతిజెలంగుతప్పకన్॥ 20

(అనిన సంతోష మొందక డోలాయమానమానసయై)

మి- క. మాటలాకకోటిచెప్పిన
పాటిక చేలుండువచ్చిహానుదలిర్చ
న్నాటములదేల్చకుండిన
బోటిరొసంతోష మెట్లుపుట్టును చెపుమా. 21

అయినమీయిష్టానుసారంబువచ్చెఁదదియు తీరును. నారదునిమాటలకన్న నీతోటయెక్కువయే! మీకుకోపంబురానేల లెండు. (అని అందరు పరిక్రమింతురు.)

(రంగము. శృంగారవనంబు.)

మిత్రవింద చెలికత్తెలతోఁబ్రవేశించి యచ్చటివింతలు కన్నులకొలఁదిఁ జూచుచు చెలులంగనుంగొని)

ఫీలురాగము-ఏకతాళము.

వనమెంతో శృంగారమే బాలా!
విసమిట్టిదని గట్టిగను నెవ్వారసైరిమున్ను॥ వన॥
ఆలమల్లెపువ్వుగలతావు-లిలమించెగలిగించె!
వలనొప్పబలుకూరిమెదప॥ వన॥
చామంతివిరులేమొపొల్పుఁబొంది-నామీఁదనామోద।
మీమాడ్కిఁబ్రేమంబుఁజూపె॥ వన॥
ధరచోళ్లేరుపురమునుండి-వరతాడేపలి లక్ష్మి!
నరసింహారాయేద్యుఁడేలు॥ వన॥

సీ. తనముక్కురంగుస♦య్యనబూనెననికదా
చిలుకదాడిమపండ్లు♦చించుచెల్ల
తనపల్కునీడయం♦దునిచెనేడనికదా
యామ్రంబుననుపికం♦బఱచుచెల్ల
తమకుంభములదాక♦తలచినవనికదా
వెలగపండ్లకుకరు♦ల్వేచుచెల్ల
తనశైత్యమొగిగర్భ♦మునదాల్చెననికదా
వలిగాడుపరటుల♦గలచుచెల్ల.
గీ. తమతనుప్రభలొగితరం♦గములనుంచె
ననిగదా వానిహరియించ♦హంసలెల్ల
నీకొలంకులలోనుండు♦చెల్లచూడ
చిత్రమయ్యెనుపూదోట♦చెల్వమెల్ల. 22

(అని కీరవాణి కై దండకొని)

ఆహా మంగళాంగి మనకుటంగట చెలంగు సరోవరస్థిత మంజుతర కంజాతపుంజ సంజాత, మకరంద, బిందు సందోహపాన మద బంభర డింభ శుంభ త్సంగీత మాధురీ శ్రవణాసక్తచిత్త సమాగతైణ కిశోరంబులును తద్దైణకిశోర విశాల చంచలదృగంచల సంభూత హాశ్చర్య రసమహార్ణవ తరంగిత రంగిత కరుణాప్లవస్థిత వనదేవతా వితానంబును, తద్వనదేవతా కనత్కనక కుంభసదృశ మాంసల స్తనయుగ్మలావణ్య వీక్షణమాత్ర వ్రీడీకృత కరిణీనికరంబును, తత్కరిణీనికర సముద్యత్కర కంపితరసాల రసారుహంబులును, తద్రసాలరసారుహ పతితమహా రుచికరఫలవితానభుజ్యమానసంతోషిత వనసంచార శబరవనితా సందోహంబై వెలుంగు నీయారామంబు నందనంబును గ్రేణిసేయుటకు సందియంబే సంతోషించితి. (అనిన కీరవాణి సంతోషంబున)

కీ—కం. మెచ్చితివీవనరాజం
బచ్చుగదోహదముసల్ప♦వైతివికొమ్మా
మి—కం. మచ్చికతోనడిదెల్పిన
మెచ్చుచుసల్పెదనుమనకు♦మేలుగదమ్మా. 28

(అనిన ప్రతివృక్షంబును జూపించుచు)

కీ—సీ. ఇదియశోకముదీని♦పదతాడనముసేయు
మిదివకుళంబు మే♦లొదవనుమియు
మిదికురువకమునీ♦వెనసికౌఁగిలిగొను
మిదితిలకంబిందు♦వదనచూడు
మిదియెమాకందమి♦య్యెడకరంబునముట్టు
మిదికర్ణికారమిం♦పెనయఁజేయు
మిదియెవావిల ముఖా♦హీనవాయువుఁగప్పు
మిదియె నమేరు మో♦మెత్తినవ్వు

గీ. మిది యొసంపెంగముఖరాగ - మెలమి నీయ
మిదె ప్రియాళిపుసంగీత మిచ్చెఁ బాడు
మీవిధంబునఁ బుష్పించు నీకుజంబు
లట్లుగాకున్నఁ బుష్పించ వదినిజంబు. 24

(అనిపలుకు చెలిపలుకులకు పులకనవ్వు లొలుక)

మి— కప్పూరగంధి! నీచెప్పినచొప్పున చేసితివి. నీవన్నమాట లన్నియు వన్నెబెట్టినట్లు జరుగుచున్నయవి నావెంట నంటిరమ్ము. నెచ్చెలీ! యిచ్చట విచ్చలవిడి పూసిన పచ్చపువ్వుల గోరంట దంట కొల్లగా నల్లుకొని తరణి కిరణంబుల జొరనీక చల్లగాడ్పుల కిరవై యుల్లసిల్లు యీమల్లెపొదలలో నుల్లంబులు రంజిల్ల సల్లాపంబులాడుచు కంటికింపైన నీటుకాండ్రతో బోటులు నాటంబుగా కూటంబులా నర్చుట కావో యెంతవీలుగా నున్నదో కన్నులారజూచితివా? యిది యట్లుండనిమ్ము. మనకు అంగట జెలంగు సంపెంగలసొంపు కంటికింపుగా కంటివా ఘుమఘుమమను వాసన లెల్లదిక్కుల నల్లుకొని బంగరు రంగును తురంగలించగల సోయగంబుచే నివ్వాటిల్లు పువ్వులు కొల్లగా శోభిల్లుచున్నయవి. ఇట్టి పసగల కుసుమంబుల దంట కొక్కెతుమ్మెదయైన మతిమఱచియైనం జేరదు కదా. నిండుజవ్వనంబున గండుమీలు నాయండకా పుండరీకాక్షుండరుదెంచని చందం బిందు గన్పించుచున్నయది. అక్కా నాకొక్కరుతోడై రికదా. ఇదిపోనిమ్ము. ఈపన్నీరుకాలువ దాటిపోదము రమ్ము. తొయ్యలీ! యీతియ్యమామిడిచెట్టుకొమ్మలసందున పసందుగానుండి మెండుగా పండిన పండులను తనచంచుపుటంబుతో చించి రసవిసరంబు పసమీర త్రావి తనచెంతనున్న కాంతకందించుచున్న యీశుకరాజంబును చక్కగాజూచితివే! యేమిహాయైశ్వర్యము! యెక్కడచూచినా స్త్రీపురుషుల కన్యోన్యదాంపత్యంబు సే కన్పించుచున్నయవి యిదిచాలించుము. చల్లని నీరంబులు వెల్లువలై పారుచున్న నాసరసిచెంత నొక్క వింత గన్పించుచున్నయది. చె

చ్చిరపోదమురమ్మా. చూడు-చూడు. చేమంతి పూబంతులు రెండుచేతికిచ్చి హెచ్చిన మచ్చికతో నొక్కచెంచుకోడెకాడొక్క చక్కెరబొమ్మనుగట్టిగా బట్టుకొని నీచెక్కుటద్దంబులొక్కసారి నొక్కనిమ్మని మ్రొక్కిన నాటక్కులాడిగిరక్కున మరలిపోవుచున్నయది. అది రతిపరిశ్రమ మెఱుగనికన్నియవలె దోచుచున్నయది. కాకపోయిన యాకలికికంటికింపుగన్పింపకున్న వాడేమో? లేక మననిద్దరినిచూచినయీముద్దియసిగ్గుచేబోవుచున్నదిదెమో. బోటీమనకేమైన పాపంబుప్రాపించునా (అనినకీరవాణినవ్వుకొనుచు)

కీర—బాలా! నీవెంతబేలవే యీవాలుగంటినేమైనమన ముద్దనిగద్దరించితిమాయేమి. నీపిచ్చిముచ్చటలికజాలించుము (అనిపశ్చిమదిక్కుమొగంబై)

మి—కలకంఠకంఠీ! మనమనేక మధురరసభరితంబులగు ఫలంబు లనుభవించితిమి. సుధామధురంబైన చల్లనినీరంబులుగ్రోలితిమి. ఈయారామంబునన్నలచిత్రంబులెల్ల కన్నులకింపుగా చూచితి మికకొంత సేపు ఒక్క శౌలరసాలభూజంబుక్రింద నెలరాతితిన్నెయందు కూరుచుని పరిశ్రాంతిజెందుదమా తల్లీ. (అందరుపరిక్రమింతురు.)

(రంగము-వనములోనున్నమేడ. సఖీపరివృతయైనమిత్రవింద ప్రవేశించుచున్నది.)

మి—మదనమాలా! కాంచితివా.

గీ.- భానుడరుదెంచునని ప్రేమమూని వేడ్క
పశ్చిమాశాసతీమణి పరగనెఱ్ఱ
పట్టుచీరెను దాల్చినపగిది చూడ 25
సంజకెంజాయదోచెను ఛాయగతిని.

క. ఆచీరపనికిరాదని
దాచివెసన్నల్పుకోకదాల్చినగతిమా
డాచానకటికిచీకటు
లీచతురాశలమెలంగె హెచ్చుగపైపై. 26

క. నిక్కముగ గగనచారులు
చక్కగదీపంబులిడినచందంబున నే
డక్కాచూడవెమింటను
జుక్కలుకన్పట్టిచూడచూడఁగనింపై. 27

చంద్రోదయవర్ణన.

సీ. హరికిమ్రొక్కెడిశచీతరుణివెల్గించిన
దీపించుకర్పూరదీపమేమొ
పూనిజయంతుడొప్పగభార్యవెసచూడ
మొనసిచూపించెడిముకురమేమొ
తమ్ముడుచూడకందర్పుడొయ్యనగట్టి
పంపినముత్యాలబంతియేమొ
యమరులు తమజపంబమరఁదెల్పఁగవేడ్కఁ
గట్టించినట్టి జేగంటయేమొ
గీ. సారవల్లభకంఠస్థహారమందు
బరగుచున్నట్టివజ్రాలపతకమేమొ
వైజయంతమునందు దుర్వారగతిని
నలరుగోమేధికపు గడియారమేమొ. 28
(అని కొంతసేపు వితర్కించి గట్టిగా)
సీ. కర్పూరదీపంబుగాదీవెలుంగుపై
వెలయజక్కవకవవిప్పఁజొచ్చె
వరపుగాముత్యాలబంతిగాదీప్రభ
పొడగన్నవెన్నెలపులుగులెచ్చె
ఖచరులమేటిజేగంటగాదీకాంతి
చూచినపద్మములొంపునిచ్చె
క్రమదర్పణఫలకంబుగాదీరుచి
గాంచినకల్వలగములుమెచ్చె.

గీ. సన్నసన్నని వెన్నెల లల్పాగెనమ్మ
చూడచూడగ వలిగాడ్పు సోకెనమ్మ
మగువ చుక్కలు పైపైన మాసెనమ్మ
పేర్మిగనవమ్మ యిది చంద్రబింబమమ్మ. 29

(అని తచ్చంద్రాగమంబున కానందభరితాంతఃకరణయై కొంత సేపూరకుండి)

ఓ మదనమాలా! ఓ కీరవాణీ! గండుమీరెడి యీ పండువెన్నెల జగదండంబు నిండికొని కాంతిమంతంబై యున్నదను సంతోషంబు నామంతనంబున కింతయైన లేదుగదా! మీకందరి కెట్లు లున్నదియో యెండకాలంబున పండునిప్పుల దండగూరుచుండ నెట్లుండునో యీ చంద్రుని చంద్రికా హారంబు నామేనికంత యుష్ణంబు చేయుచున్న యది. నాకీబాధసోకకుండ నీకల్వల జేదును వేడుకొనుచున్న దాన.
(అని ప్రకాశముగా)

క. చల్లని రేడవు నీదగు
చెల్లెలు కల్కులనొసంగు క్షితినందరికి
న్నొల్లగనీ బావయుపెను
బల్లిదుడు భవద్గురుండు పాల్కడలిగదే. 30

ఇట్టి నీవు నాయట్టిపట్టిని రట్టుపెట్టనాయమా (అని వేడుకొని ననంతకంతకు కిరణప్రసారణం బెక్కుడైన తీవ్రకోపానలంబు దరికొల్పుచు,) శీతకరణా! యిక నీగర్వభంగం బగునట్టుగట్టి తిట్టుల తిట్టెద చూడరా (అని బిగ్గరగా)

సీ. పగలెల్ల దాగి దొంగగతి జేదిరుగాడు
ముచ్చ నీ యెదపైన మచ్చపుట్ట
సొంపుగా మిత్రుని చూడలేక నలంగు
దైన్యాత్మ నీకళల్ దరగిపోను
చదువు చెప్పినవాని ముదితను చేకొన్న
పావి లేనట్టి నీకన్నాముబట్ట

మొదటిచెల్లెలితావుముకుళింపచేసిన
ఖలనీకపాండురోగంబుపుట్ట
గీ. పుట్టినింటినిబొంగించికపారలసేయు
కష్టజాతివినీజిగికాఁబూచుండ
వెసవియోగులపైఁ బండవేయుచుండ
కందదాయనునీకండకొందురుండ. 31
క. తరుణులబాధింతురయా
పురుషులకై సిగ్గులేకపొల్పుగనీవా
మారుడాయుష్మంతులరై
వారిహారిపావులకునాయువధికముగాదే.
ఉ. మునుపలదక్షయాగమునముఖ్యతదక్షునిపక్షమైమదం 32
బునపడివీరభద్రునితోఁబోరిననిన్నొగివామపాదఘ
ట్టనలయించెనప్పుడుతటాలునబారితివారమూర్ద్రశాం
గనలగలంచకోరిచెడుగాయిదిబంటుతనంబెరాజుకా. 33

(అనియనేక విధంబుల దూరిచెలులగనుంగొని) ఇక్కరాతుం
డుక్కుమిగిలి త్రిప్పినమొండివడి పండువెన్నెలల నలయింపుచున్నవాఁడి
క నేనోర్వజాల. (అని మూర్ఛమునింగినకీరవాణిమదనమాలంజూచి.)

కీ—క. వనబాస్త్రునిబారికిజ
వ్వనిగుందినగాదెమనముక్షవనముకురాక
ల్వనజాక్షినిచటనటువలె
వనజారినలంచసాగ్రేవనమేలయికన్. 34

(అనిమదనమాలయోచించి)

మ—అక్కా ఈచక్కరబొమ్మను శీతోపచారంబుల న్మూర్ఛ దేర్చి
యింటికిచేర్చి యీమచ్చటలా మచ్చెకంటితల్లికి నన్నలకు న్దెల్పి
శీఘ్రకాలంబులో స్వయంవరంబు జరుగునట్లు సేయుట యుచిత
మైనట్లు నాకు తోచుచున్నయది. నీచిత్తం బెట్లున్నదో యోచిం

చుము. లేనిచో నీతోయజానన కాయజ తోయజారులబారులచే డస్సినపిదప మనమేమి సేయుగలవారము. (అనిన)

కేర——మదనమాలా ! నీయోచనయోచింపతగినదే.

(అనిమూర్ఛదీర్చి, అందరు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

## చతుర్థాంకము

(రంగము-విందుఁడు-అనువిందుఁడు-మంత్రి.)



ర్మసచివ! ఇటురమ్ము.

మం—రాజకుమారా! వచ్చియున్నవాడ నెలవేమి.

విం—క. మామిత్రవిందకాశ్రిత
కామకువరుస స్వయంవరము సేయుమటం
చామునిపతి చెప్పినమన
మేమి యొనర్పకనునుంటిమిందాకనొగిన్.

కావున మంచిముహూర్తంబు విచారించి చెప్పుటకు మనపురోహిత శిఖామణియైన గర్గమహాముని నారావింపుమా.

మం—చిత్తమాలాగే పిలిపించుచున్నవాడ. (అంత గర్గుండరు దెంచి ద్వారపాలకుఁజూచి)

గర్గు—ఒరీ! నీవెవ్వండవొ నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా?

(అనిన వాడులోపలికిపోయి)

ద్వా—ఓరి! నీవెవ్వడవ్రా నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా? (అనినరాజునవ్వుచు)

విం—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చియురానిమాటలు మాట్లాడకుపో.
(అంతవాడరుదెంచి గర్గునిజూచి.)

ద్వా—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చిరాని మాటలు మాట్లాడకు పో.
అని అన్నాడయ్యా స్వామి!

(అనిన వానిఁజూచి)

గ—అట్లాగాదురా శంతా! ఆయన వచ్చియున్నాడని అనరా.

[అనిన ద్వారపాలకుడిట్లనగా రాజు కోపోద్దీపితమానసుండై.]

విం—ఛా! దుష్టమానసా! చెంపలు వేయించెదవెళ్ళిపో. మళ్ళావచ్చితి
వేని నీమచ్చమాపెద (అనిన వాడువచ్చి అదియేఅనును)

గ—ఈమాటువెళ్ళి మీపురోహితుండగు గర్గుండు వచ్చినాడనిచెప్పు
మురా (అనినచని వాడట్లుచెప్పును)

విం—శీఘ్రముగారమ్మనుమని చెప్పుమురా (ప్రవేశించును)
విప్రవర్యా పదివేలవందనంబులు కల్యాణు, కల్యాణు. ఈమ
ణిసింహాసనమందధిష్ఠించుడి (కూర్చుండిపిమ్మట)

గ—రాజన్యశేఖరా! మీరునన్ను రావించిన కారణంబేమో సెలవివ్వు
డు (అనినహాసన్ముఖుండై)

విం—గీ. పొందుమీరగ మామిత్రకవిందకిపుడు
పరిణయమొనర్పగను స్వయంవరము సేయ
బూనినారము శుభకరంబైన యొక్క
లగ్నముసుచూచిచెప్పుమీకలలితచరిత. 2

(అనినసాబ్రాహ్మణుండు హాస్యరసంబు చూపించదలంచి)

గ—రాజా మేముక్రొత్తగా గుద్దలించిన పంచాంగశ్రవణ శ్లోకంబుసా
వధాన చిత్తుడవై వినుము, (అని పంచాంగము చేత పుచ్చుకొని
బిగ్గరగా)

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహతం దుస్వప్న దోషాధికం।
గంగాస్నానవిశేష పుణ్యాహననం గోదానఫంగం నృణాం।
ఆయుర్భంగమముత్తమం సుచిహతం సంతాన సంపర్ధరం।
నానాకుగ్మతసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

అద్యరాత్రి తిథిప్రమణత రంగసాని... ......గడబడ నామ సంవత్సర దారితలమాసంబున నింద్రియపక్షంబున నేడు ద్వాదశాంగుళ ...... వారం కంఠాభరణ నక్షత్రం దుర్మదయోగం బాలకరణం. ఈరోజున పన్నెండుగడియలరాత్రికి ... ... ... ... ఛార్జం తెల్లగా వెళ్ళిపోచుంది మహాప్రభో! (అనిన రాజు ముసిముసి నగవులునగవుచు)

విం—గురుశిఖామణి! మీయిక హాస్యరసంబుమాని శాంతరసంబుగైకొని మేమడిగిన ప్రశ్నకును త్తరంబొసంగవలయును. మహాత్మా! (అనిన సంతోషితస్వాంతుండై)

గర్గ—అట్లాగే చెప్పుచున్నాను. రాజేంద్ర!

గీ. సరవి రేవటిమాఘమా◆సంబునందు
శుక్లపక్షంబునసుమడి◆సొంపుమీర
దశమిగురువారమునమహా◆దాత్తగతిని
నెక్కులగ్నంబుసఫలమై◆యున్నదయ్య, 3

ఈలగ్నంబున మీరాకార్యం బొనర్చితిరేని చక్కగా నిర్వర్తిల్లు. రాజచంద్ర! (అనిన సంతోషించి మంత్రిమొగంబుచూచి.)

విం—నర్మసచివా! యీధరాసుర శిఖామణికి అనర్ఘ్యవస్త్రభూషణతాంబూలాదికంబు లిప్పించి వీడ్కొల్పుము. అంగవంగ కళింగ కాశ్మీర కురు కరూశ ద్రవిడాంధ్ర దేశ ప్రముఖ చప్పన్న దేశాధినాథులకు ఈవార్త శుభలేఖలమూలముగా తెలియపరుచుము. లగ్నకాలంబు వరకేవిధమయిన లోపములు లేకుండునట్లు అన్ని కార్యంబులొనర్పుము. మననగరంబుశృంగారింపఁ బనివాండ్రని యమించుము.

మం—భవదాజ్ఞాను సారంబుగా భూసురోత్తమున కన్నివిధంబుల సంతోషపెట్టి పంపినాడ. తక్కినవన్నియు క్రమక్రమంబుగా సిద్ధపరుచుచున్నవాడ.

(అందరునిష్క్రమింతురు.)

## రంగము—భర్మ హర్మ్యము.

(మిత్రవింద ససఖియై ప్రవేశించి, చిత్రజాయత్త చిత్తయై తత్తరంబున.)

14 జంఝూటి-రూపకము.

మరచిపోతివా కృష్ణా-కృష్ణా కృష్ణా నన్ను
కలువరీర నీదు సోయగంబుగాంచనైతిహా।
నెరకౌగిటనుండితివను-బిరుసునవేమోసపోతి  మ॥
ఇచ్ఛకములు చేసినా-కేమోయేమో యేమో చెప్పి।
పిచ్చిదానిచేసికూరి-మెచ్చజేసితాహా।
మచ్చికచేవయ్యెదముడి-విచ్చినవలపుచ్చటలు  మ॥
పెదవికేనియులాని-యానియానిడుచ్చి।
సదమలాంగినిన్ను బాయు-జాలనంటినాహా  మ॥
ముదమొదవగకందర్పుని-కదనంబుననేలవదడి।
ధరణిచొల్లేరుపాల-పాలపాలశౌరి।
కరుణతాడేపల్లిలక్ష్మి-నరసింహరాయావన।
శరణంటినిసరసిజముల-నిరసించెడిచరణములకు  మ॥

(అను వాక్యంబులు విని వెరగంది కీరవాణి మదనమాలలు లేచి)

చెలి—తల్లీ! రాజపుత్రీ! నీకొదవినమదనజ్వరంబును చంద్రశైత్యంబును పోగొట్టి యుంటిమే. తిరిగి కృష్ణపైత్యోద్రేకంబు గలిగినట్లు తోచుచున్నయది. ఏమికారణంబు చెప్పు మొప్పులకుప్పా (అనిన తలయెత్తి చూచి మహాదైన్యంబున)

మి—ఉ. ఏమనిచెప్పుదాన తరళేక్షణలార! మదీయమానసం
బౌమురవైరియందుప్రియమారగడించెనుమేనుమాత్రమి
చ్చోమిముబాయకున్నయది-సొంపుగనేనుగమింగువెల్లవం
దైమనియున్నదంచునెద-లందులనమ్మకుడమ్మమీరికన్. 4

(ఆత్మగతంబున)

15 నాటకురంజిరాగం-రూపకం

మరచినామరపురావుగా—పగకానివగలు॥
కరుపుదీర మోవిపాన-కంబుగ్రోలిచవులకలరి।
చెరుకురసంబాకలెక్కయే—చెలియనిపలికినపలుకులు మఱి॥
నడుముక్రిందయెడమచెయ్యి-నాణెముగనుజొనిపియెత్తి
యొడలెల్లనునొడలిపయిన్యడ-కౌగిలిగొనుదుడుకులు మఱి॥
కప్పురంపువిడెముపంట-గట్టిగానుబట్టినన్ను
చప్పునమునిపంటనుగొను-మిప్పుడనెడుపలుకులన్ని మఱి॥
లలిదలిర్పతాడేపల్లిలక్ష్మి-నారసింహరాయు
నలరించెడుచొల్లేశ్వర-జలజాక్షునిబలునేర్పులు మఱి॥
(అనికీరవాణిమదనమాలలగనుంగొని)
సీ. రాదుగానాయింటికివాడుగాదయవీడి
నాడుగానాయుమేఁజూడవమ్మ
(అనినమదనమాలయంజలిపట్టి)
మ—ఎందుకేచెలివానిఁబొందుకేగదదీని
మందుకేయోచించుఁజుందునమ్మ
మి—పోదుగావిడనాడఁరాదుగాయింకూర్మి
లేదుగాప్రియముననాఁమీదకొమ్మ
(అంతకీరవాణి తేనెలొలుకుపలుకులతో)
కీ—కందకేమదిభీతిఁజెందకేమరుబారి
గుందకేధైర్యంబుఁజెందవమ్మ
మి—గీ. మానవచ్చునెయనుభవమ్మైనకతల
మ—మానుటొకయుత్రమమేవెత్తిఁదానవమ్మ
మి—పోయివచ్చెదివారెవ్వరేయచటికి
కీ—పంపవేపోయివచ్చెదఁబైడిబొమ్మ. 5

చికురనిందితషట్పదబృంద ! మిత్రవింద ! నీడెందంబున నెందుకు సందియంబు. నీయిష్టంబుకష్టంబనకస్పష్టంబుగా చేసెద. చెప్పదగి.

నమాటలు చెప్పిన నిప్పుడే పోయెద. నామాట ముమ్మాటికి నమ్ము.

(అనిన చిలునవ్వునవ్వుచు కీరవాణింజూచి)

మి—సీ. కనుమూసినను చూచి • ననుసీదు సోయగం
బున్న తగతితో చూచుచున్నదనుమి
తనుమానినను కాని • పనిబూని పెరవాని
కోమలికలనైన • గోరదనుమి
తనయన్నలను మన్న • ననుగోరి తనవూన్కి
తెలియగా నూచన • తెలిపెననుమి
సిరిపట్టువర వెట్టి • నరుచిర బౌణము
ల్వేయుగా చెలినిల్వ • దాయెననుమి
గీ. యలుకలొలుకగ కలకల • బలుకుచున్న
చిలుకపలుకులకలకల • కులికెననుమి
ఝుమ్ముఝుమ్మనుభసలగా • నమ్మునకును
కొమ్మకిమ్ముగ తలద్రిమ్మ • గ్రమ్మెననుమి. 6

ఉ. రమ్మనుపువ్వుబోణికి కరమ్మను రాగముకల్గనీపయి
నెమ్మనుభక్తిమీనసలిపకలెన్నను పందగుమా శుభాంగినీ
సొమ్మనుకొమ్మగాదొకరికిసొమ్మను వేడుకతోడనీవుగై
కొమ్మనుపైడిబొమ్మయనుకొమ్మనుకృష్ణునితోడనెచ్చెలీ. 7
చ. దరమనుమా శుభాంగికిముకుందంబలరించెడికందరంబునుం
దరమనుమాపసిండికినికతళ్కులొసంగెడిమేనికివికా
వరమనుమాచనుంగవకువారిజలోచనరేపెనాస్వయం
వరమనుమాజనార్దనునికివాసిగతోడ్కొనివేగరాసుమా. 8

(అనిచెప్పి నిరుపమాలంకార సర్వావయవయై తనశృంగారం
బంత యొక్కదర్పణపటంబునం దాకర్షింపచేయించి యాది కీరవాణి
కరంబునకు కరంబుగానొసంగి ప్రకాశముగా)

16 శ్రీరాగం-రూపకం.

పోయిరావె బాలికామణీ। హరికడకు నేడు॥ పో॥
నాయుదంతమంత జెల్పి తోయజాక్షుని యెడకును బోయి కతే॥ పో॥
నిన్ను నమ్మియున్న దానను। నామనమునందునీ॥ ని॥
కన్నె పోయి మెల్లసొగసుగా నొనర్చి। వెన్నునకే జన్నె కడితి॥ పో॥
ఒంటిగాంచి మాటలాడవే। గోపాలుతోడ నెంటి॥
కొంచెమైన యచటి వాలు గంటులకట। వింటే బల్తుంటాయిక॥ పో॥
ధారుణి చోళ్లేరుపురమున। విహరించుచుండి॥
నారితాడేపల్లి లక్ష్మీనారసింహారాయావనుడేలును నిను॥ పో॥

కేశాశితజితనీరదశ్రేణి! కీరవాణి! నాసంగతినీ వెఱింగిన దేకదా! మొట్టమొదట పటంబుముందటబెట్టి కనిపెట్టి మాటలాడుము. స్వయంవరంబునకు దప్పక రమ్మనుము. రానట్టయితే నీరాచపట్టి సిరిపట్టిబెట్టేయునలరంప కట్టియలు గుట్టుచెడగొట్టు. మట్టు మీఱినవగలసెగలన్నొగలి నగుబాటుజెందునని మురుందునితో చెప్పి యొప్పించుకొనిరమ్మి. వచ్చుచో యీవటఫలాధరుని పటంబు దెమ్మి. శుభమ్ముననొమ్మి (అని రెండుమూడడుగుల కొలంది సాగనంపును.)

(అందరునిష్క్రమింతురు.)

రంగము—ద్వారకాపురంబు శ్రీకృష్ణకోట్టు.

కృ—(కోరమీసంబులు వడవేయుచు) అపదుద్ధరొన్నత్య! యుద్ధవామాత్య!

మం—చిత్తము నందితసనక సనందన నందనందన!

17 జంఝూటిరాగం—రూపకం.

కృ—మంత్రిసత్తమా! తెలియంగబల్కు। మంత్రి॥
తంత్రములను సేయుచుభువి దానవులు జెలంగవారి।
మంత్రంబులువినిశితశర మంత్రంబుల ఖూల్చెదవడి॥ మంత్రి॥

మం—నందనందనా చేసెదనుమనవి। నం॥
ఇందిరేశదనుజుడొక్కడేని-యుద్ధరాస్థలంబు।
నందునగాన్పించరయే-సందునడాగిరొ తెలియదు॥ నం॥
కృ—భటులువచ్చిరే మనమంపినట్టి॥ భటు॥
దిటవుమీరగానునరుడు-నిటలనేత్రుగూర్చితపము।
పటుగతితోనొనరించియు-పాశుపతాస్త్రముగొనెనట॥మంత్రి॥
మం—నిజము దేవరా మీఱున్నవారు॥ నిజ॥
విజయునిపూన్కి దీరకున్నె-విస్ఫురత్కృపాఫలంబు
భుజియించిన కరుణించక-పోనే శంకరుడైనను॥ నం॥
కృష్ణ—శూరులెల్లను సుఖమున్నవారే॥ శూ॥
పౌరులెవ్వరైన దుష్ట-బాధజెంది యుందురుగద
కారుణ్యామనంబుల మన-వారలు వర్తింతురుగద॥ మంత్రి॥
మం—ధరణిచోల్లేరు పురపాలుడగుచు॥ ధర॥
వరుసతాడేపల్లి లక్ష్మీ-నరసింహ రాయాగ్రగణ్యు
సిరులొసగుచు రక్షించెడి-ధరణిజపుని బోలినశ్రీ॥ నంద॥
సీ. పాపిపూతనముస్నె•ప్రాణముల్వీడిపోయె
మదతృణావర్తుండు•మాయమాయె
శకటాసురుండుభా•స్వద్రీతినిద్రించె
కడుబావుకొంగరక్కసుడుగాంచె
కంసభూపతితమ•గమునుండిపడిచచ్చె
చాణూరుడాయమ•స్థలముసొచ్చె
యవనుండు మదమున•దవిలి నేలకుగూలె
త్రిజరాసంధుండు•వెతలదూలె.
గీ. దుష్టసంఘముభవదీయ•ముష్టిహతుల
దెళ్ళిపోయినకతమున•దేవమధ్య
రాష్ట్రజనులెల్లహాయిగా•రాత్రిబగలు
సౌఖ్యములదేలుచున్నారు•చక్రధరణ.

నిర్వక్రపరాక్రమ నిర్దళిత దుష్టరాజచక్రుండవై ప్రకాశించుభవద్రక్షణీయంబగుచున్న రాష్ట్రింబెల్లనుల్లసిత సర్వసౌఖ్యలీనంబై యున్నయది. శౌర్యౌదార్య ధైర్యగాంభీర్య ధుర్యుండవగు నిన్నింతవాడవని స్తోత్రంబుసేయుటకు పాత్రుండనే భక్తపక్షపంకజాక్షు!

(అనిన సంతోషిత స్వాంతుండై కోరమీసంబులు వడపెయుచు)

కృష్ణు—ప్రస్తుతకరణీయంబులగు కార్యంబు లెవ్వియు లేవుగదా.

మం—చిత్తము. విచారించిచూచిన నేమియుకనుపించియుండలేదు.

కృ—చం. కుడితొడచేయి లోచనము కొలుంతితరీతి చలించుచున్నది

యెడనెడలోన వేడుకలుకొ హెచ్చుగజొచ్చెను దుఃఖ్యణిన్మృదం

బడరగబెండ్లియాడుతరికై నగతిన్గనుపించెనాకు నే

ర్పడవివరించునీమదిరికారంబుగయోచనచేసిమిత్రుడా. 10

మ—సంరక్షిత కృష్ణా! శ్రీకృష్ణా! భవదమృత మధురవాక్యంబులీ సేవకునకు కర్ణానందంబులు చేయుచున్నవి. కొద్దికాలంబులోనొకముద్దియ నీముద్దరాలగు నట్టుకను పట్టుచున్నయది. ఇందుకెందును సందియములేదు. దక్షిణనాయకుండవై ప్రకాశించునీకెందరుసుందరులైనం గొదువగానే యుందురు. దేవా!

(అని అందరు నిష్క్రమింతురు)

రంగము-కృష్ణుండు కీరవాణి.

(కీరవాణి భయభక్తియుక్తిచే తస్కాయై యొక్క పటంబు వారిముందటన్బెట్టి చేతులుజోడించి)

సీ. జోహారులవెనీకు బాహాబలోద్ధూత

ఘనవిక్రమోద్దీప కంసభావ

దండంబులవెనీకు ధారాధరోపమ

భాసురతరనీల భర్మచేల

జోతలివ్వెనీకు సుందరాపహాసిత

కందర్పశతరూప కమ్రచాప

మ్రొక్కులిడ్వెనీకు మునిజనసంతాన
సన్నుతగుణజాల సత్యశీల
గీ. వందనంబులుసద్భావఁవాసుదేవ
శరణులివెహీరకోటీరఁశౌర్యసార
నతులొనర్చెదలఁదుర్కృతవిపక్ష
కోటియభివాదనములయ్యఁగోనికాయ. 11

కృ—శీఘ్రమేవ భవదిష్టార్థసిద్ధిరస్తు. (అని తదీయలావణ్యంబున కతి కుతుకాయత్త చిత్తుండై నవ్వుమొగంబుతో)

మ. సకియాయెవ్వరిదానవెందుకొరకైఁచాతుర్యముప్పారభ
ర్మకలాపద్యుతితోడవచ్చితివితోఁరంబైననీరూపుమ
చ్చికచేగాంచినమోహమున్నైనగానెఁదెల్యోవ్వప్పగాచెప్పుత
ప్పకనాతోడభయంబుమానియువతీఁభాస్వన్మరాళీగతీ. 12

(అనిన శౌరిదయార్ద్రదృష్టికి సంతోషించుచు)

కి—ఆ. పేరుకీరవాణిఁసారసమృదుపాణి
పటములోననున్నఁపడతిమిన్న
సేవసేయుదానఁచెలగినన్నాచాన
మెచ్చుపఱపగానుఁవచ్చినాను. 13

(అనిసమీపించిపటము చేతపట్టుకొనిచూపించుచు ప్రకాశముగా)

కృ. ఇదికదాకలలోనఁగదసితేనెలబావి
యనిచప్పరించినఁయట్టిపెదవి
ఇదికదా యెదయెదఁగడియకౌగిలిగొని
సరవితోమెచ్చినఁచన్నుదోయి
ఇదికదా యెడమచేఁయిడిమేటిముకురంబు
కరణినున్నదటన్నఁమరునియిక్క
ఇదికదా తమకంబుఁగదురగామేనిపై
వ్రాలిముద్దాడుకఁపోలపాళి,

గీ. ఇదికదా నీ వెముడి విచ్చికవదలదీసి
చెలిమిత్రోదూలఁద్రోసినకచీలకొంగు
ఇదికదానిందుజాబిల్లికనదరగొట్టె
నంచు మెచ్చినయీసుందరాంగి మోము. 14

శా. నీమేనత్తకు బుట్టినాహా మొదలోక నీమీదట న్బెట్టియా
న్నోమార్లంగజు బారిగిట్టి విధినూకనుండింపు చేపట్టియో
భామా నీపతిగట్టియుంచు కలుకకన్యాభవంబునద్దట్టిమా
రామారత్నము వట్టియున్నదిసుమా కపాణింబుస ర్వేశ్వరా. 15

(అనిపలుకుపలుకుచుకు పరమానందంబుజెంది యాపటంబు క
రంబునబట్టుకొని తదీయ్యరూప యావన విలాసంబులకు మెచ్చి
కొనుచు తనలో తాను నవ్వుకొనుచు తలయూచుకొనుచు మీసంబులు
దువ్వుకొనుచు కిరవాణింజూచి)

కృ—ఆ. తల్లిదండ్రులెవరుక తరుణికిపేరెద్ది
యున్నదమ్ము కెందరతివయుండు
దేశమెచటదానికతెటతెల్లంబుగ
విన్నవింపుమంతకవేద్య—కాంత. 16

బాలగోపాలా !

కీ—సీ. అధిపనీమేనత్తయైనరాజాదేవి
కూతురై యొప్పునే కువలయాక్షి
విక్రమశాలులౌ విందానువిందుల
తోబుట్టువయ్యనే తోయజాస్య
భవదీయమిత్రులై బఱగుపాండవులకు
పినతల్లిబిడ్డయే పీతవస్త్ర
వైభవయుగవంతి వరపట్టణంబున
జన్మించెనేమహా జ్వాలకలాప,

గీ. యదియెరదబృందకాంత్యప హసితకుంద
సఖిజనానందకచరిత సజలకంద

బుధవిహితచ్ఛందవరయానఁ పుషితమంద
మేదురార్చితకుందమాఁ మిత్రవింద. 17

(అనుపలుకులు చెవులకు రసాయనంబులై దోప యావటంబు దిక్కు చూచి చూచి) కుంతలాకార మధుకరశ్రేణి! కీరవాణి!

కృ—మ. తరుణీనాకదివావికిన్దగిన దేఁతప్పేమినన్నొకట
ల్గరమర్ధిన్గలలోన దోచినవనుఁల్గామింపగా బాడియే
సరవిన్దర్పణపృష్ఠభాగమున భాఁస్వద్దీతిగన్పట్టునుం
దరరత్నంబులమూట నందుకొనకాంఁతాయేరికిన్నక్కమే. 18

(అని పలుకు కృష్ణుని యభిప్రాయం బెఱింగి)

18 బేహాగ్ రాగం-ఆదితాళం.

కృ—వినుముదెల్పెదదానిపల్కు పల్కు-పల్కులను-తేనెలొల్కు॥
కనులతళుకు-బెళుకు చేపలనుచు జెప్పనొప్పునా। నీ।
గనినమారుడనగనెంత మనముననాశ్చర్యమొంద॥ వి॥
ముక్కుసంపెంగపువ్వునేలు పెద్దయద్దా
ల్పెక్కులడాలు ముక్కు-టెక్కులాడిపరులుకుమ్మెద
రెక్కలనెకసక్కెములాడు-నిక్కుచున్నచనులుపిల్ల
జక్కవలకొక్కరించు॥ విను॥
మోముసోమునితోడబోరు-నారుతీరుచీమలబారు
కామినికంధరముదరము-కోమలియానముసమద
సామజముగానుబల-మేమియులేదునిజముగ॥ విను॥
పరమదుర్మార్గుల చెండీ-చోల్లేరనువురమునసుండి
ధరణితాడేపల్లిలక్ష్మీ-నరసింహరాయాగ్రణికి
సిరులనిచ్చిబ్రోచుసీతా-వరునిబోలినట్టిశౌరి॥ విను॥

సీ. చంద్రచేలంబు భాఁస్వద్దీతినీకుంటె
చంద్రఫాలంబుమాఁ సతికిలేదె
చక్రంబునీకరఁస్థలిప్రకాశించితే
చక్రంబుమాఁచెలిఁ స్తనముకాదె

కంజంబున్ననాభి గామోద మొందితే
కంజంబు మాయింతి గళము కాదె
రంభనీకడ జేరి రాగంబు పాడితే
రంభ మాసఖిమారు రతిచెలగదె
గీ. నీవుగల శబ్దవితతి లోకనిక్కముగను
నగము భాగించుకొని యెహూ చానమున్నె
రాకనీకేలతప్పమా రామకడకు
బాలగోపాల! రాధికా ప్రాణలోల. 19

ఉ. కంటికి నిద్రలేదు నిను గంటిని ముందొక రేయిపూటనా
యింటికి వచ్చి పుష్పశరు డేచగ నానజనింప జేసి బ
ల్మంట మెలంగ బెట్టితివి ధర్మమె రేపటనా స్వయంవరం
బొంటిగ నందరిన్గెలచి యొప్పగ నన్గొనుమన్న దీశ్వరా. 20

ఉ. అందరికంటె నీకు ప్రియురాలైన చెలిన్గద యట్లటన్న నే
పొందుగ మేనయత్తకును బుత్రికనైన కతంబునన్గదా
సుందరరూపయోగ్యుని ప్రచూచిన నుందిగనాడపోకటం
బిందుని భాస్య చెప్పవనే జేతుణ రాగదవయ్య మొక్కెదన్. 21

(అని పలుకుపలుకులకు మొలకనవ్వులొలయ నింతలో కంతుండంత లతాంతకుంతంబులేయ నంతకంత కా కాంతపయి న్మోహం బెక్క గోరమీసంబులు దువ్వుచు)

కృ—కుంతలనిందితబంభరజాలా! బాలా!

ఉ. వచ్చెద నేస్వయంవరము వారణజూడగ నాడు దానినే
మెచ్చెద రాజలోకమున మేయగతిన్నిరసించి దానినే
దెచ్చెద నెవ్వరైన మొన దెలియెదిర్చిర యేని బాణముల్
గ్రుచ్చెద మింటవేలుపులు కోయనియార్వ మదేభగామినీ. 22

ఉ. వద్దనుమింక నెమ్మదిని వారిజనేత్రకు చింత తానునా
పద్దనుకష్టముల్జరిగి పాయెనుపాయు మికేలనాకదా

ముద్దనునాకు నీవయినిఁ మోహాముమించెను కూర్మినీవయి
న్కద్దనుపోయిరమ్మి కనుఁ కంజదళాభ విశాలలోచనీ. 23

ఈపల్కులు నాపల్కులుగాఁ జెప్పి కప్పురగంధికి కంతుసంతాపంబు కొంతయైన శాంతిబఱుపుము. శుభమ్మున బోయిరమ్ము.

(అనితనపటంబొసంగిన)

(అందరు నిష్క్రమింతురు)

చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

---

## పంచమాంకము.

(మిత్రవింద, కీరవాణీ, ప్రముఖులు ప్రవేశింతురు)



తల్లీ మిత్రవిందా! నమస్కరించుచున్నదాన.

మి—నీకు శుభంబగునుగాక. (అని సుందరమగుపటంబు ముందరబెట్టిన పటంబు చక్కగా కనుంగొని ముద్దు పెట్టుకొని)

అక్కా! నీయొక్క భక్తిశ్రద్ధాను రాగప్రియంబులకే నెంతని సంతోషింతునే. నావరాధనంబు దొంగిలించిన దొంగను నెత్తెరంగు నపట్టితెచ్చితివే. నీవంటిదాసీలుండ నేలికసానుల కొక్క కొఱంత యైనసుండునా! దీనికి ప్రత్యుపకారంబే నేమియొసంగెద. రమ్ము. ఒక్కబిగి కౌగిలిచ్చెద. చారువేణీ కీరవాణీ! (అని మోహావేశముఖియై పటంబుచూపుచు)

మి—సీ. ఈతడే మరుబారికెఱుగనినన్నేరి
మోవిపానకమానుకముద్దులాడు
ఈతడే బిగికౌగిలిమ్మని ననులాగి
చెక్కిలిగొరికినచెలిమికాడు
ఈతడే కుచపాళికెనలమితోడవిరాళి
జేదోయిముట్టినచిన్నవాడు
ఈతడే తొడలంటియింపుతోడననంటి
కంబంబులనిజానికగన్నవాడు

గీ. ఈతడే నన్ను వలపించి♦హితవునించి
మనసుగరగించి మెరసినకీమాయకాడు
ఈతడే నన్ను గనిచాల♦యిచ్చ మెచ్చి
హర్ష మొనరించిపోయిన♦యందకాడు. 1
క. ఎప్పుడువచ్చెదననుచును
జెప్పెనునీతోడనాతకిజెప్పుసుమ్మా
కి—క. ఇప్పుడుశుభ మేనమ్మా
తప్పకవచ్చునుగదమ్మ♦తథ్యముకొమ్మా. 2
మి—సీ. మెచ్చెనానన్నుమన♦సిచ్చెనానీతోడ
గలసిమాట్లాడగా♦కంతుమూర్తి
చూచెనాపటము చే♦వీచెనానినుగూరు
చుండగాదానవ♦ఖండనుండు
కప్పెనాకూరిమి♦చెప్పెనాముందటి
ముచ్చటలేమైన♦మునినుతుండు
పట్టెనావంకంబు♦కట్టెనాకంకణం
బెలమివచ్చెదనన్న♦నిందుముఖుడు
గీ. ఒంటరిగనీకుదొరికెనా♦యింటిలోన
చేడెలెవ్వరునినుగాచి♦చూడకుండ
తోచెనానిక్కమందునా♦ధుండువల్కు
పల్కులన్నియువివరిబోణి♦పద్మపాణి. 3
అక్కా! రేపులేదెల్లుండియేకదా స్వయంవరంబు ప్రవర్తిల్లు
ట, యికనమ్మకమ్ముగా నొక్కకూర్కుపోయెద.
(అని అందరు పరిక్రమించిరి.)
రంగము-అవంతీపురము—గొప్పఅద్దాలమేడ.
(కృష్ణసాత్యకి దుర్యోధన ప్రభృతిరాజులు ప్రవేశింతురు.)
(అనర్ఘ్యరత్న వస్త్రభూషణ మాల్యానులేపనసంయుక్తన్జేసి
నవీనమోహినీదేవి లీలప్రకాశించు మిత్రవింద చేతికి నొక్కకాంచనపు

ష్పమాలనిచ్చి మదనమాల కీరవాణులిరువంకలనలంకరించి స్వయం వరంబున కఱుదెంచిన రాజమండలి కనతిదూరంబున నిలిపిన చక్రధ రుం డక్కుమారిఁజూచి పుష్పశరప్రేరితుండై కోరమీసంబులు వ డవేయుచు)

కృ-సీ. ఇదిమింటిపైనుండి ◆ యెందుకో తెగివడ్డ
తొలకరిమెరుపులో ◆ తునకయేమొ
యిదిపూలవిల్తుడిం ◆ పొదవ భార్యకునయి
కఱగిపోసినపైడి ◆ కడ్డియేమొ
యిదినలకూబరుం ◆ డెలమిరంభనుమాని
మరలఁగైకొన్న యా ◆ ప్సరసయేమొ
యిదివసంతుఁడుతన ◆ యెలికకెంపుగా
బంపినచామంతి ◆ బంతియేమొ
గీ. యిదిజయంతుఁడు ప్రియమెద ◆ పొదలపెంచి
యల్కవ్రేదమువిడిచినరా ◆ చిల్కయేమొ
యిదిఖచరులెల్లముదముల ◆ వ్రుదలిపొదలి
తెరసడల్చినమోహినీ ◆ దేవియేమొ. 4

(ఇవ్విధంబున నవ్వనజలోచనుం డతీత మోహావేశ సంచలిత సర్వశరీరుండై, యాసుందరాంగి న్జనాంతికంబుగా కన్నులారఁజూచి)

సీ. వలబడ్డజక్కవ ◆ ల్వోలెనున్నపిచాన
పైటలోపలనున్న ◆ పాలయిండ్లు
నిండుచందురులోని ◆ నెరికప్పచందమి
యెలనాగ మోముపై ◆ వెలయుబొట్టు
పెనుతాచువడగవి ◆ ప్పినరీతిదీపి కీ
జెడమీఁదఁగన్పడు ◆ బెడగుసొమ్ము
మరుఁడువిండులు రెండు ◆ మఱియెక్కిడినగతి
పొలుచునీలేమ క ◆ న్బొమలవంక

గీ. తమ్మిపై వ్రాలు తుమ్మెద దండుపగిది
నింతి మొగమున జేలాడు కుంతలములు
రతికరస్థసుహేముకురద్వయంబు
భాతి చెలిచెక్కులందుఁ గన్పడు మెఱుఁగులు. 5

(ఇట్లు తనమనంబున బెనంగొను మోహాతిరేకంబున బొగడుచున్న నింతలో నాసుందరి మందమందయానంబున సుందరీమణులకై దండలుగొని రాజలోకంబును గ్రేగంటంజూచుచు తదీయ రూప యౌవన విలాసంబులం దృణీకరించుచు కీరవాణి మదనమాలల మొగంబుల్గనుంగొని)

మి—చ. ఎవరెవరీమహీశ్వరు లహీనపరాక్రమశాలులై మహో
త్సవమున నీసభారుచిర సౌధమునిండినవార లిప్పుడో
కువలయనేత్రలార! మదకుంజరసద్గతులార! మిమ్ము నే
సవినయవృత్తిఁ గోరితిని చక్కఁగఁ దెల్పుఁడి దెల్యనాకొగిన్. 6

(అనిన నాసుందరీమణు లానందంబున)

కీ—సీ. ఈనృపశేఖరుండిభపురీశ్వరుఁడైన
దుర్యోధనుండు నిస్తులయశుండు
ఈరాజకుమారకుండితనిసోదరుఁడుదు
శ్శాసనుండార్జితశాసనుండు
ఈసుకుమారకుండీనృపపుత్త్రుండు
లక్షణచరితుండు లక్షణుండు
ఈయినతేజుండహీనవిక్రముఁడైన
కర్ణుండు సద్గుణోదీర్ణకుండు.

గీ. ఇతడు మాళవదేశంబు నేలువాడు
ఈమహీశుడు కోసలభూమివరుడు
ఈధరాపతి కాశీశుఁడిభబలుండు
ఇతడు సాల్వరసావరుండిందువదన. 7

కీ—సీ. సద్గుణంబులపేటి శతకోటిమన్మథ
సుందరుండితఁడు కృష్ణుండు బాల
హాలధరుండీహరి యన్న మహాబలుం
డీమేటిబలరాము డిందువదన
యీశూరు డారుక్మి ణీసునితమ్ముండు
సాత్యకియనువాడు సామజగతి
కంసునిమిత్రుడు కూటవిక్రమాఢ్యుడీ
కృతవర్మయననొప్పు కీరవాణి
గీ. వీరు కేకయరాజులు విబుధహితులు
వీరు సృంజయభూపతుల్ వీరవరులు
వీరు కర్ణాటకేశులు విజయయుతులు
వీరు మత్స్యేశసావరుల్ కల్హారసాక్షి. 8

(అని వేర్వేర జూపించిన కొమ్మనిమ్మళముగాచూచి తనకంటికి దంటయైనవాని నొక్కరునైనఁగానక క్రొత్తచిత్తజునివలెపోచుచున్న వెన్నునిచూచుచున్నయెడ కృష్ణుండుపట్టరాని మోహంబున యాడిట్టి రిన్నవయదలచి యాత్మగతంబున)

కృ—ఆహా! చక్కెరచవులధిక్కరించగల యీటక్కులాడి కమ్మనివా తెరనొక్కసారియైన జురుక్కుననొక్కి యందుసందులేక జూరుతేనె లజాలునుగ్రోలి చప్పరించనియీప్పలుగాకి నాలుకనాలుకా! వహవ్వా! మెరుంగుటద్దంబులం దురంగలించు యీకురంగలోచని గండస్థలంబులు కొండొకసేవు నిండువేడుకతో ముద్దుపెట్టని గద్దరీడు పెదవులు పెదవులా! అబ్బురంపు జక్కవగిబ్బలనుబ్బరంబును దెబ్బనబడద్రోయునీబిబ్బోకవతి సిబ్బెంపు గబ్బిగుబ్బల దెబ్బలబడి నిబ్బరించనివాని వక్షము వక్షమా! షహబాస్ తొగలతెగల వగలనగలచేసి జిగి నెగడుచందురుని యందంబు పసందుసేయుని యీమందయాన సుందరాననంబు చెన్నుమీర కన్నులార జూడలేని కోడెకాని లోచనంబులు లోచనంబులా! బళా! రంగారు బంగారుతీగెల సింగార



మెంతని లడాయించ బడాయిగల యీనాతి చేతులు చేతో మోదంబుతో చేతితోఁబట్టుకొని గట్టిగామాటలాడని మేటి కరంబులు కరంబులా! అరే! బెళుకువాలుగల తళుకుల కులుకుగలుగ జెలగునీ కోపనచాపలంబులకు చూపులను నోపికతో నిలుపలేనివాని ధైర్యంబు ధైర్యంబా! అబ్బబ్బా! గోచరంబైన మోచాస్తంభంబుల నీచంబులు చేయు నీకర్ణాంతాయత లోచని యూరువులారని మోహంబున తేరి చూచి మచ్చికచే మెచ్చనివాని మానసంబు మానసంబా! నేనెవ్విధంబున నైన నీజవ్వనికొరకై యీవసుధావరులతోఁ తవ్వులాడియైన దక్కించుకొననైతినేని నేనుకృష్ణుండనా! పోషితజిష్ణుండనా! (అనవసరంబున నమ్మగువ నగుమొగంబుతో రెండుమూడడుగులిడినచో దుశ్శాసన పుత్రుండగు లక్ష్మణుండు చూచి మదనపీడితుండై యాత్మగతంబున.)

ల—ఉ. ఇచ్చెదనాకటంచుమును♦నింపుదలిర్పగవిందరాజువా
త్రచ్చెనిదేమిహేతువకొ♦కొమ్మకునేడుస్వయంవరమ్మతా
నిచ్చదలిర్పనేర్పరిచె♦నీవిధమెల్లనుచిత్రమయ్యెహా!
యిచ్చపలాక్షినన్నువిడి♦యెచ్చటికోజనబూనెమూఢగన్. 9

సీ. ఈనారివాతెఱ♦పానకంబౌనని
నాల్కగాదదిమోహ♦పల్కగాని
యీచానచెక్కులు♦యాచించినొక్కని
పండ్లుకావవిరాతి♦గుండ్లుగాని
యీచెల్వపయ్యెద♦లోఁ జెయ్యిబెట్టని
కరముగాదదిదుఃఖ♦కరముగాని
యీసోముముఖిమేని♦వాసనల్గాంచని
ముక్కుగాదదికొండ♦నక్కగాని

గీ. యెలమితోదీనిసోయగ♦మెన్ననట్టి
నోరుగాదదియొకపట్లు♦కారుగాని

కోడెతనమునదీనితోఁగూడనట్టి
చెలువుగాదది యొకకొండఁ జెలువగాని.

(అని తనమనంబున) నేను నూరక చూచుచున్న నీబోటిదాటి సూటిగా యేనీటుగాని చెట్టబట్టునోగాన దీనిపోనీకపట్టెద. (అని కొంతసేపూరకుండి) ఇందరిలోఁ నీసుందరాంగి న్బట్టిననేమిహాని బూనునో! పట్టిననాపట్టులోఁ నీదిట్టరినిలుచునో నిలువదో! నిలవక పెనుగులాడినచోఁ చేడెకుచాలదని కోడెకాంద్రేమైన నవ్వుదురేమో అని యుల్లంబెల్ల తల్లడిల్ల కొంతవడికి ధైర్యంబు దెచ్చుకొని) కానిమ్ము చూచుకొంద మిక్కడ మావాండ్రందరుండ నడ్డగించువారెవ్వరని దిగ్గన లేచి కరవాలంబు ఝళిపించుచు తోఁవకడ్డంబై.

19 పురాణభూషణం—ఆదితాళం

పోకుపోకిక్కడనిల్వవె బాలా। దాటి।
పోకడనీకెంతోమేలా॥ పో॥
నీకొరకెయూసించివచ్చియుంటి। నీదు।
షోకెల్లకన్నులంగనుగొంటి। నీకు।
నాకనుదీటుగానున్నదంటి। యింత।
లోకిబాకుబీకినన్ను డీకొనెమారుఁడు। దయ।
రాకయున్న - పువ్వుకోలాల।
కాకలపాల్గాకయుందునె॥ పో॥

మి—ముట్టకుముట్టకు దూరముండు। నేను।
గట్టిగనుజూచినను మేనుమండు। నన్ను।
కట్టడిపను లెందుకు దాటిపోర। యింత।
మిట్టిపాటునీకునాయమార। రాచ।
పట్టివైతె యీపనినీకుమేర। యిక।
బెట్టుమట్టుబెట్టుకొక తట్టునతొలగుము। తొలగ।
నట్టయితేనాచిన్నన్నచేబట్టితె నీపట్టువుడువు॥

ల— సుందరి బెదరించితె భయమాగన|పనితే|
కుందునె యూరకవచ్చినాన|జగ|
త్సుందరి యిందుముఖి కౌగిలియ్యకున్న|మోద|
మొందూనె డెందము చెల్వాలమిన్న|నీకు|
వందనము సేతు సేయుమన్న|భేద|
మెందుకింత సుందయాన సుందరుఁడగానా|కోర్కె|
లెందుకీనవిందనుమాన మెందుకెనాయుందుచాన॥ పోకు॥

మి— రాజులునవ్వీన సిగ్గులేదా|ఛీఛీ|
నీజన్మము నేలపాలుగాదా యెల్ల|రాజు|
రాజిత తాఁ జేపలిలక్ష్మీనాథ|సింహా|
రాయనేలు చొల్లేరుపురవిహార|హరి|
ప్రేమజెలగు జానకీశునిగోర|కల్ప|
భూజమగు మనన్నుబ్రోవ డెజోకదలిర్ప|శత్రు|
రాజిచూడనేగోరినరాజునె నా రాజుజేసి॥ ముట్టు॥

ఓయి భ్రష్టప్రజ్ఞా! ఈస్వయంవర సభారంగంబున కట్టుపదలి నన్ను పట్టవచ్చెద వీరట్టునీకెట్టుపోను. నీవు రాచపట్టి వయినట్లు దోచక యున్నయది యూరకుండుము. నీమాన ప్రాణంబులు దక్కించుకొనుము. (అని రాజలోకంబు వీక్షించి ప్రకాశముగా) ధరాధర తల్లజులారా! యీయల్లరి మీయెల్లరి యుల్లంబులకు సమ్మతంబే కదా. (అనునంతలో ననువిందుండు మహారోష భీషణాకారంబుతో వచ్చి వరలోని కరవాలంబు కలుక్కున దూసి చెల్లెలినిఁ బిరిందికిద్రోచుకొని వానినెదిరించి భీకరముగా రౌద్రరసముతో.)

శా. ఎట్టా నీయిప్పటి పల్కుపల్కితివి యో హీనాత్మ నైగన్వ్రతునీ
పట్టాభామము కాస్యబట్టెదువహా వ్వాయీ మహారాజుల
న్నట్లన్నెట్టివి పుశీర్షభాగమున గర్వంబెక్కెనా కుజ్జనీ
కట్లల్పాగపు మాసభాస్థలమునన్ గాఁ ప్రున్న సేపేటికిన్.

అ. కన్యక స్వేచ్ఛగా నందఱిఁజూచి తనకంటికెవ్వఁడిష్టమైతోఁచునో వా
నినివరియించుటయే స్వయంవరము. దానియర్థం బొక్కింతయైన
నెఱుంగనినీవొక్క రాజపుత్రుఁడవా! ఛీఛీ! నీమొగంబు చూచుట
పాతకంబునకు హేతువు. ఇట్టినిన్ను గెంటించుటయేమేలు. నీవంటి
తుచ్ఛభూభుజ కుమారులీ సభలోనున్నను బుద్ధిగలిగి వర్తింతురు
గాక. లెమ్ము. (అనెడిమాటలు కర్ణంబుల కశనిఘాతంబులై కోప
దుశ్శాసనుం డాగ్రహాయత్తచిత్తుండై గద్దియపైనుండి దిగ్గునలేచి
కరవాలంబు ఝళిపించుచు)

దు-శా. ఔరాదుర్మతిమత్కుమారకునిసాహంకారతన్దూఱెదా
నీరాజత్వముమాపయిన్నెరపెదే నిర్భాగ్య నీవెంతనీ
బీరంబెంతబలంబదెంతకుమతీ బిట్టల్కపుట్టించితిం
కేరీతిన్నృపితుకంగజాచెదవునీకీవేళతోమూడెనే. 12

మ. సకలోర్వీతలనాథమస్తకలసజ్జాంబూనదంచత్కిరీ
టకసద్రత్నమణిప్రభాపటలిచేఁడంబైనపాదంబులీ
య్యకలంకాత్మునిపెద్దతండ్రికిక దాకీయాయోగ్యతల్దూరచే
సికటా! పిల్లనిధిక్కరించెదవెఛీఛీపాపయజ్ఞానసా. 13

ఓరీ! మత్తచిత్త! చతురుదధివలయితభూచక్రస్థిత రాజాధిరా
జమకుటమణి ప్రభావిరాజమానచరణద్వయుండగు ధుర్యోధన చక్ర
వర్తి సోదరపుత్రుండై వెలంగుచు రంగత్ప్రతాపుండగు నీలక్ష్మణ
కుమారుండీయంబుజాక్షిని నడ్డగించుటయొక్క లెక్కా! యికమాట
ధిక్కరించి మాటాడితివేని నీచెక్కుముక్కు కరుక్కున గోసివేసెద.
హీనశౌర్యా (అని మీఁదికురుకును, అంతలో కృష్ణప్రేరితుండై కృతవ
ర్మ పుస్తుమీసంబులురిస్తుగా దువ్వుచు పలుకయు వాలుంగొని గద్ది
యపైనుంచి గబుక్కునదూకి దుశ్శాసనున్గదిసి)

కృత-శా. ఓయీ కౌరవరాజసోదరమదీయోద్యోగ మీక్షించితే
స్వాయత్తైశ్వర్యముగల్గెనేని యిదెనాకైపైరమ్ము కాసేవుచే

చేయుఁజూచెద మాతనిన్నొకరగాఁ జిత్రంబె నీపుత్రకుం
డీయోషామణి బట్టనాయమగు నేఁడీభూమిభృత్సత్సభన్. 14

బాగు బాగు స్వయంవరసమయ సభామధ్యంబున న్యాయ విచక్షణం బిసుమంతయైనలేక హరిమధ్యంబట్టిన నీపట్టికి తండ్రిననిచెప్పకొని యుప్పరంబగల నార్చుచున్న నీగొప్పతనంబునకు నేను సిగ్గుపడుచున్నవాఁడ నిక యూరక కూరుచుండుము. శ్రీదేవినాతో వృథావాదంబులేక తారసిల్లుము. (అనిన నెయ్యిపోసిన భగ్గుభగ్గున మండిపడు అగ్గికితగ్గిన కోపంబుచే కరవాలంబు ఝళిపించుచు దుశ్శాసనుండు సమరోన్ముఖుండై మహారౌద్రరసంబు చిందులుగార)

దు—మ. ప్రతివర్షంబున మాకుకప్పములు శుంభద్భక్తినర్పించు వీ
డతిగర్వంబున మాటలాడవిని యాహాపట్టిపాలార్తునే
కుతలంబందొకఁడైననాకు నెదురై కోల్పోకప్రాణంబులు
ద్ధతిజీవించనె రమ్మురమ్మికనీదర్పంబొగిం జూచెదన్. 15

ఓరీ! శుంఠప్రతాప! నీకంఠంబు మత్కరవాలధారచే తీరుతీరుగా తరిగి ఘోరంబగు నీకబంధంబటునిటు కావుకావుమని వాపోవు కాకగృధ్రంబు లనేకవిధంబుల గొనియాడ విందుపెట్టెద. ఎట్టకేనికిఁ జొక్క దిట్టవై రమ్ము. క్రొవ్వియెవ్వరైన వెరుంగక చివ్వకున్నారసిల్లెదవ! వీండ్లందఱుంజూడ నీకండ్లకావరంబు కొంచెములో దించెద. భోజకులపాంస! (అనునంతకు దుర్దాంత కల్పాంత కాకాయుండై మేనుపెంచి పండ్లుపటపట కొరుకుచు దుశ్శాసనున్నని యనేకవిధంబులకరవాసివిక్షేపణంబు సేయుచు)

ఉ. మత్కుణమొక్కవ్రేలఁ బిసమానిసినల్పినరీతి నిన్ను నే
నుత్కటకీర్తిబట్టినగఁ బ్రొప్పగనల్పెద నెవ్వరడ్డమై
మత్కరవాలధారకసమానగతిన్గరమిచ్చువారు ఛీ
సత్కులసూతివై యిటుపాఁసంగనికూతలుకూయఁజెల్లునే. 16

రాజరాజసోదరుండవయి రాజలోకంబు ఛీయన చేయరాని పనులుచేయుచు కూయరానికూతలు కూయుచు కులపాంసుండవయి

వృట్టితివేడినీ గట్టితనంబు చూపించుము అని మీదికిలంఘించి శిరోజం-
బులు పట్టబోవునెడ కర్ణుండడ్డమై కరవాలంబెత్తి సాముసేయుచు)

క—చ. నిలునిలు మోరినిన్ను చనఁ • నిత్తునెమాయయువ రాజుపై కిదో
ర్బలముననన్ను దాకిమద • పారవిజృంభణశక్తి కోర్చిన
న్గలుగుభవత్ప్రతాపము • గర్వమునంతటి దాకనిన్ను నే
బిలుతునె పోరుడంచునిటు • బెట్టు మునీముఖమింక దుర్మతీ. 17

(అని గర్వంబులాడుచు దుశ్శాసనలక్ష్మణ సహితుండై కృత
వర్మ న్పట్టి కట్టప్రయత్నించు రాధాపుత్రు దుష్ప్రయత్నంబు గనుం
గొని సాత్యకి గదాదండంబు కేలన్గొని గద్దియపైనుండి డిగ్గనురికి హే
తివ్రాతంబుతో గల వీతిహోత్రునకు సాటియైన కర్ణునకడ్డంబై)

సా—మ. చెడుగానీ మొగమిట్లు ద్రిప్పిగనుదా • సీపుత్రయో కర్ణ! యి
య్యెడ నేనున్న దెఱుంగవ్రాకమలక • య్యెన్నో బలుపెన్నిడిబ
ల్వడిమద్బాహువునందుగల్గెడిగద • న్వైరుండవై తేనిని
వ్వడా గిన్నాపలచేతబట్టిజనము • ల్వాలాపందగాద్రిప్పవే. 18

ఆరే సూతసూతి! దుర్జనవ్రాత! ఘాతుకుండై జెలంగురంగత్ప్ర
తంగ పుంగవతురంగునకు సోదరుండనై యవక్రపరాక్రమసంతోషిత
శక్రుండై విజయుండని పేరుజెందిన పాండవమధ్యమునకు ప్రియశిష్యుం
డనై యున్న నన్ను దాకినీశక్తి ప్రకాశింపజేయుము. నేనాండిభోజపతి
న్వారింతునే! రమ్ము. లేనిచో యుద్ధాస్థానంబునందు నిమ్మళమ్ముగా
కూర్చుండుము. ఖండితప్రతాప! (అనుమాటలు చెవులకు ములు
కులై దోప సాత్యకిముఖుడై)

క—కం. గొల్లడపాలును పెరుగును
చల్లమ్ముక బ్రతుకకింత • సాహసమేలా
బల్లిదులగు రాజన్యుల
నల్లంబగలించి బ్రతికి • యుందువె చెనటీ. 19

(అనుమాట లశనిఘాతంబులై కర్ణరంధ్రంబులన్బడిన సాత్యకి
గదసారించుచు)

20 శమాచి—ఆదితాళము.

సాత్యకి—రారపోరుదమిప్పుడు పారిపోకదుర్మతీ॥ రారపోరు॥
కౌరవేంద్రుడేరికోరి నినువరశూరుడనుచు
గౌరవింపబలికెదు॥ రార।

క—పోరునాకొక్క-వెండ్లిగా-వీరవరులుడాసిన। పోరు॥
వారివీరివలెనన్నుజూచితో-కౌరసిల్లునీదర్పముగనియెద॥ పో॥

సా—ఎంతరనీదుబలము-వివరించిచూడ॥ నెంత॥
వింతగనాగద్రవేటునసీశిర-మింతింతలుగానిప్పుడుచేసెద॥ రా॥

క—ఆడదియైనగానదు-నీమాటలకెదభయ॥ మాడ॥
వాడిగలుగుకరవాలమెత్తితిని-చూడుమిదిగో
నడిమాడునద్రవేసెద పోర॥

సా—గద్దరిమాటలేలర-చూచికొనుమునీయురి గద్దరి॥
గ్రద్దనసీపిడిగ్రుద్దునగుద్దినదద్దరిల్లుచునుధరపైగూలవె రార॥

క— ఇలనుచోళ్లేరుపురిని-వెలసినసౌధంబున యిలను॥
చెలగుచుతాడేపలిలక్ష్మీనరసింహరాయ
వరదుడైనవెరతునె పోరు॥

(అనియిట్లిద్దరన్యోన్యజయకాంక్షులన్యోరాడుటకై నిశితకాక్షేయువిక్షేపణరీబులు సేయుచుందురు)

(వ్యాసమహాఋషి ప్రవేశము)

వ్యా—ఓహోహో! యాదవకౌరవవీరులారా! యికమీమీ తెగువలు చాలించుడు. నామాటలువిని శాంతింపుడు (అనువాక్యంబులందరి కర్ణరంధ్రంబులన్పడి తమతమకైదువులువదలి యమ్మహానుభావునకు మ్రొక్కుదురు (అంతవ్యాసుండుకృష్ణునిట్లని) త్రిజగద్రక్షా! దుష్టజనశిక్షా! పుండరీకాక్షా! కృష్ణా! పోషితకృష్ణా! నీవుండియేనా వీరినీపనుల చేయించుట? భవన్మాయాంధకారకూపంబున బ్బడివెడలు మార్గంబు శంకరపంకజాసనుల కుందరంబె మహానుభావా! రక్షింపుము రక్షింపుము.

(అని రాజలోకంబు నిరీక్షించి)

ఉ. ఏతపనీయచేలుఁడు మహేశ్వరసన్నుతుఁడే యదూత్తముం
డేతరణిప్రభామకుటుఁడే నవనీరదచారువిగ్రహుం
డేతులసీవిభూషణుఁడయే సుమసాయకకోటిసుందరుం
డాతఁడె కేశవుండు వరుఁడై తగు నీముకురాస్యకిప్పుడున్. 20

కాన మీరందరానందనందనున కీసుందరి నుందరియై పెంపొందుటకు డెందంబుల నానందింపుఁడు ఇది బృందారక సందోహంబునకును శంకర వాణీవశంకరులకును హితవై యున్న దిందు కెంతయు సందియంబు లేదు. (అనునెడ మిత్రవింద వధూటికామణి డాసి వ్యాసునకు మ్రొక్కును, ఆ సుందరి యందంబు చూచి పారాశరపుత్రుండు నవ్వు కొనుచు)

వ్యా-ఉ. జవ్వని నీదుపాయముకుఁ జక్కఁదనంబుకు నీదురీవికిన్
నవ్వుమొగంబునన్ వృషినాగరికంబును మెచ్చినాఁడ నీ
కెవ్వనియందు కోర్కె జనియించెనొ నిర్భయమొప్ప నేఁగి నీ
వవ్వరశౌర్యుకంఠమునఁ హాయిగ నేయుము పుష్పమాలికన్. 21

(అనిన సంతోషిత స్వాంతయై చేతులు జోడించి)

మి-సీ. ఎవ్వాఁడమర్రకొత్తఁ పువ్విలుకాఁడునా
గొల్లపిల్లలపయిఁ జెల్లఁగొనియె
నెవ్వాఁడు వరశౌర్యుఁ డెనయఁగా నామేన
మామకుఁ బట్టమై మలయుచుండె
నెవ్వాఁడు సోయగంబింపార జనుదెంచి
కలలోన నన్మోహకలితఁ జేసె
నెవ్వాఁడు బలిమిచే నెల్లదుష్టుల జంపి
దృఢశక్తితోడ సత్కీర్తిగాంచె
గీ. నట్టికౌస్తుభమణిహారుఁ డనవసుధీరు
జిష్ణుసన్నుతు సుగుణరోచిష్ణు కృష్ణు

శౌరియున్న దినాంమదిగుణవిధాన
దయఁగనుంగొనుమిక పోయి దండవేతు. 22

(అని నమస్కరించి నిలచియున్న చేడెన్గాంచి)

వ్యా. శీఘ్రమేవ మనోవాంఛాఫలసిద్ధిరస్తు. సుందరీ! యాలస్యం బెందుకు నీయిష్టమ్ముకానిమ్ము. (అనిన చెలులిరుగడలనడవ మందమందయానంబుల ననికరంబున న్వెలుంగు కాంచనమాలిక హరికంఠంబునవేసి తలవంచుకొని నిలచియుండును.)

(అందరు నిష్క్రమింతురు)

రంగము—వివాహమంటపము.

(గర్గమహాముని విందానవిందులు కృష్ణసాత్యకి బలరామ కృతవర్మలు మిత్రవిందా మదనమాల కీరవాణులు విధ్యుక్తప్రకారంబున కల్యాణంబొనర్చి సోదరీమణియైన మిత్రవిందను కృష్ణునకొసంగి విందానవిందులు చేతులుజోడించి)

విం—సీ. నిరుపమవిస్ఫురత్స్వరసిజాయతనేత్ర
భైష్మీకళత్రశుంభచ్చరిత్ర
పృథుసురభీయుతబృందాటవీలోల
పాలితామరజాలనీలనీల
ఘనరుచిజితమూర్త్యకౌస్తుభాంచితహార
నవనీతచోరదానవవిదార
సుందరతిలకసంశోభితసులలాట
మానితఖగఘోటమణికిరీట

గీ. రత్నకుండలయుత కర్ణరమ్యవర్ణ
సూరి సందోహమందారతారహార
విజయవందిత గోవిందవిశ్వతుంద
కేశవాచ్యుత సత్కీర్తికృష్ణమూర్తి. 23

చ. పొలుపుగ మేనమామకునుపుత్రుడనేనిటు లుండమానిమి
చెలియలికి స్వయంవరముసేయుటతప్పని యెంచబోకుడా

ఖలుడు సుయోధనుండు మముఁగారియబెట్టు నటంచుయుక్తిపెం
పలరగ జేసినారము సుకేధాధరమిమ్మె వరించునంచొగిన్. 24

(అని జాంబూనదాంబరాభరణ గజతురగస్యందన భటనటవి
టగాయక పరిహాసకదాస దాసీలనరణంబొసంగి సాగనంపిన అం
దరు నిష్క్రమింతురు)

మంగళహారతి. రాగం. నాదనామక్రియ-ఆదితాళము.

మంగళమిహాశౌరి।లోక।మంగళదాయక మంగళవిగ్రహా॥ మంగ॥
రంగాపతంగతురంగపోషితకు-రంగా సద్గుశఫాల।
మద।భృంగాచికురజాలా।బుధ।సంగక్షేమచేలా,
రణరంగరిపువిఫాల। యంగజాంగభంగలోల॥ మంగ॥
రామానిర్జితభృగురామా।శ్రీకృష్ణబలరామా రాధికాజార।
పరభీమా కంసవిదారా।రవి।ధామాకౌస్తుభహారా।
గోపి।కాముఖపద్మసూర। కామకామశ్యామాకార॥ మంగ॥
నందగోపాలకనందన సనకాసనందనహృదయతోష।
పరి।క్రందితభక్తదోష।జన। వందితచారుభూష।
కవి।మందారనరకశోషా, మందమందసుందరభాషా॥ మంగ॥
నరతాడెపలిలక్ష్మి నరసింహరాయోద్య నరసఖమందహాస।
చొల్లేరు।పురభద్మహర్మ్యవాసా।జానకి।వరనిత్యసత్యోల్లాస,
చాంపేయ।వరపుష్పదివ్యనాసా।మురహరశరనిధిత్రాసా॥ మంగ॥

మంగళహారతి. సురటరాగము-ఆదితాళము.

హారతులివ్వగరారెలక్ష్మి నారాయణహరికి।
సమాశ్రయ।వారణరిపుహరికి॥
మహాభయ। కారణభవతరికి।
శిరోరుహా।వారవినీలవిదారితబంభర।
నారులార సుకుమారులార।శుభ॥ హార॥
తొగలమగనిజిగిదెగడెడునగు మొగముగలుగు ద్వారసుండి।
తనంతట। నెగడునెపుడుధండి।

శివాదుల| మిగిలెరిపుల చెండి| మహాత్ముఁడు|
ఖగనాయకతురగ-గమనుఁడురుప|
న్నగఫణశయనుం-డగకరిసకబలు॥ హరి॥
శరదాంతర్గతచంచలవలెసిరి| యురమునగలవాఁడు|
చెలువున|మకునిమీఁటినాఁడు| పీతాం|బరముఁదాల్చినాఁడు
చూడుడు|తరళేందీవర-దళలోచనముల|
తరుణులార కుం-దరదనలార॥ హరి॥
పాటఁబుగచొల్లేద్పురమున తాఁడే|పలికతప్పలమణియై|
మహాబుధ| ఫలదసమ్రగణియై|సదామది|
ఖలనిరసనగుణియై|ముదంబున|జెలఁగుబత్క్యనరసింహరా-
ట్పదన లయుఁడైన హరినీలునకిప్పుడు॥ హరి॥

క. సాధారణవత్సరమున
పాదుగనాశ్వయుజశుద్ధశివరవిదియను సం
మోదమున మిత్రవింద సు
ధాధరినాటకము పూర్తికయ్యె హరికృపచే. 25

ఫలశ్రుతి.

క. ఈనాటక మెవ్వరైనను
మానుగఁజదివినవిన్నఁ గమతిఁ వ్రాసినచో
మానితగతి చొల్లేరువు
రీనాథుఁడు ప్రోచుచుంబొసఁగుకృపరంజిల్లన్. 26

గద్యము.

ఇది శ్రీ మాచెర్ల చెన్నకేశవా క్షీణ కటాక్ష వీక్షణ ప్రవర్ధిత చతుర్విధ
కవితావిచిత్ర కాత్యాయనసూత్ర హరితసగోత్ర సూరపరాజగోత్ర
రోహిణీకళత్ర సీతారామమంత్రిపుత్ర సుకవిమిత్ర వేంకట
రమణ కవికందపత్ర ప్రణీతంబైన మిత్రవిందాపరి
ణయనాటకంబు సర్వంబు పంచమాంకంబు
సంపూర్ణము.

